నిత్యజీవితంలో

# డబ్బు ఆదా చేసే మార్గాలు




కె. కిరణ్ కుమార్

# బహుమతి

ఎన్నో వేలు, లక్షల రూపాయలు
ఆదా చేసే టెక్నిక్‌లు కలిగి ఉండి కేవలం
రూ. **40/-** ఉన్న ఈ పుస్తకాన్ని మీ మిత్రులకో,
బంధువులకో బహుమతిగా ఇవ్వండి.

**To** ______________________

______________________

______________________

______________________

అభిమానంతో

***Presented by*** ______________________

తేది:

ప్రదేశం :

# ఈ పుస్తకం దొరుకుచోట్లు

**డా. కె. కిరణ్‌కుమార్ రాసిన కంప్యూటర్, ఇతర పుస్తకాలు ఆంధ్రప్రదేశ్‌లోని ఈ క్రింది జిల్లాల్లో లభించును.**

| | | |
|---|---|---|
| **హైదరాబాద్**<br>సుల్తాన్‌బజార్‌లోని విశాలాంధ్ర రాజ్‌కమల్, నీల్‌కమల్ తదితర పుస్తకశాలల్లో మరియు ఆర్‌టిసి బస్టాండ్‌లోపల | **సికింద్రాబాద్**<br>శ్రద్ధా,<br>రాజ్యలక్ష్మి<br>బుక్‌స్టాల్స్ | **విజయవాడ**<br>విశాలాంధ్ర బుక్‌స్టాల్<br>కారల్‌మార్క్స్ రోడ్,<br>విజయవాడ మరియు<br>ఆర్.టి.సి. బస్టాండ్ లోపల. |
| **గుంటూరు**<br>విశాలాంధ్ర బుక్‌స్టాల్<br>శంకర్‌విలాస్ (అరండల్‌పేట)<br>మరియు ఆర్‌టిసి బస్టాండ్<br>లోపల | **వైజాగ్**<br>వాగ్దేవి బుక్‌సెంటర్<br>మరియు<br>విశాలాంధ్ర బుక్‌స్టాల్<br>(మెయిన్‌రోడ్) | **ఖమ్మం**<br>శ్రీ సాయి గణేష్ బుక్‌స్టాల్<br>7వ నెం. ప్లాట్‌ఫారం దగ్గర,<br>ఆర్.టి.సి. బస్టాండ్ లోపల.<br>ఫోన్ : 9866402298 |
| **తిరుపతి**<br>విశాలాంధ్ర బుక్‌స్టాల్<br>గాంధీరోడ్,<br>తిరుపతి<br>ఫోన్ : 2222475 | **రాజమండ్రి**<br>మణికంఠ బుక్‌స్టాల్<br>మరియు<br>ఆంధ్రా బుక్‌స్టాల్<br>మెయిన్ రోడ్. | **ఒంగోలు**<br>విశాలాంధ్ర బుక్‌స్టాల్<br>రెవెన్యూ షాపింగ్ కాంప్లెక్స్,<br>చర్చి సర్కిల్, పెద్ద పోస్టాఫీసు ఎదురుగా.<br>ఫోన్ : 280004 |
| **అనంతపురం**<br>విశాలాంధ్ర బుక్‌స్టాల్<br>కాలేజీరోడ్,<br>అనంతపురం.<br>ఫోన్ : 220614 | **నిజామాబాద్**<br>ఆదిత్య బుక్ ఎగ్జిబిషన్<br>నిజామాబాద్.<br>ఫోన్: 9849309927 | **కరీంనగర్**<br>విశాలాంధ్ర బుక్‌స్టాల్<br>మాణిక్యమ్మతోట,<br>2 టౌన్ పోలీస్ స్టేషన్ ప్రక్కన<br>కరీంనగర్. ఫోన్ : 2234054 |
| **శ్రీకాకుళం**<br>విశాలాంధ్ర బుక్‌స్టాల్<br>క్రాంతి భవన్, రామ్‌లక్ష్మణ్ జంక్షన్,<br>జి.టి. రోడ్, శ్రీకాకుళం. ఫోన్ :<br>220553 | **కాకినాడ**<br>విశాలాంధ్ర బుక్‌స్టాల్<br>మున్సిపల్ షాపింగ్ కాంప్లెక్స్,<br>మెయిన్‌రోడ్, కాకినాడ.<br>ఫోన్ : 2378992 | **హన్మకొండ (వరంగల్)**<br>విశాలాంధ్ర బుక్‌స్టాల్<br>అశోకా షాపింగ్ కాంప్లెక్స్,<br>మెయిన్‌రోడ్, హన్మకొండ.<br>ఫోన్ : 2577156 |
| **కర్నూలు**<br>ఆర్.టి.సి.<br>బస్టాండ్ లోపల<br>కర్నూలు. | **కడప**<br>శ్రీ వేంకటేశ్వర బుక్‌డిపో<br>5/275, బ్రాహ్మణవీధి,<br>కడప. | **నెల్లూరు**<br>వెంకట్రామ బుక్‌డిపో<br>గాంధీ బొమ్మ దగ్గర<br>ట్రంక్‌రోడ్,<br>ఫోన్ : 2323887 |

కొన్ని లక్షల రూపాయలను
ఆదా చేసే అద్భుత పుస్తకం

# నిత్య జీవితంలో డబ్బుని ఆదా చేసే 250 టెక్నిక్కులు




రచయిత

## డా॥ కె. కిరణ్ కుమార్

M.Com., (Gold Medalist), Ph.D., ICWAI



## శ్రీ వైభవ పబ్లికేషన్స్

ప్లాట్ నెం. 102, దివ్యసాయి అపార్ట్‌మెంట్స్
ఇం.నెం. 1-9-285/9/1, విద్యానగర్
హైదరాబాద్-44. ఫోన్ : 27090541
e-mail: srivaibhava@rediffmail.com

**EDITION : 2013**

**వెల : రూ. 40/-**

## గమనిక

ఈ పుస్తకంలో ఇవ్వబడ్డ సమాచారం ఖచ్చితంగా ఉండేటట్లుగా రచయిత, పబ్లిషర్ శ్రమించారు. అయినప్పటికీ కొన్ని పొరబాట్లు సంభవించవచ్చు. ఈ పుస్తకంలో ఇచ్చిన సమాచారం వల్ల ఎవరికైనా కలిగే కష్టనష్టాలకు రచయిత గాని, పబ్లిషర్‌గాని బాధ్యత వహింపరు. కాబట్టి ఏదైనా పెట్టుబడి నిర్ణయంలో ఆ రంగంలోని అనుభవిజ్ఞుడి సలహా తీసుకోవాల్సిందిగా కోరుతున్నాము.

**– పబ్లిషర్**

# నిత్యజీవితంలో డబ్బుని ఆదా చేసే 250 మార్గాలు

*By*

**Dr. K. KIRAN KUMAR**



*Publishers*

**SRI VAIBHAVA PUBLICATIONS**

Flat No. 102,
Divya Sai Apartments,
H.No. 1-9-285/9/1,
Vidyanagar,
Hyderabad - 44.
Phone : 27090541

# ముందుమాట

'ఒక్కపైసా ఆదా చేసినా ఆ డబ్బుని సంపాదించినట్లే!' అన్నారు జార్జి బెర్నార్డ్‌షా. ఈ పుస్తకంలో నిత్యజీవితంలో ప్రతి కోణం నుండి డబ్బెలా ఆదా చేయాలో వివరిస్తున్నాం.

ఈ పుస్తకం రాస్తున్నప్పుడు నా కొలీగ్ ఒకతను వచ్చాడు. నేను రాస్తున్న పుస్తకం గురించి చెప్పగానే అపహాస్యంలా నవ్వాడు. ఆఖరికి మా చర్చలో తేలిందేమిటంటే - అతడు మొన్ననే ఎల్ఐసీ పాలసీ తీసుకున్నాడు. మొత్తం ప్రీమియం పదివేలు. నిజానికి చాలామంది ఎల్ఐసీ ఏజంట్లు తమ వ్యాపారాభివృద్ధి కోసం మొదటి సంవత్సరం తమకొచ్చే కమీషన్ (దాదాపు 15 శాతం నుండి 25 శాతం)ని కస్టమర్‌కి ఇచ్చేస్తారు. అయితే కొంతమంది కస్టమర్లకు ఆ విషయం తెలియదు కాబట్టి అడగరు. అలాంటి వారిలో మా కొలీగ్ ఒకరు. చర్చలో మా మధ్య ఈ విషయం రాగానే అతడు వెంటనే ఎల్ఐసీ ఏజంట్‌కు ఫోన్ చేసి కమీషన్ విషయం అడిగాడు. మరో గంటలో ఆ ఎల్ఐసీ ఏజంట్ పరిగెత్తుకుంటూ వచ్చి రెండు వేలు నా కొలీగ్‌కి ఇచ్చాడు. అలా గంటలో రెండు వేలు చేతిలో పడడంతో నా కొలీగ్‌కి మతిపోయింది. వెంటనే జేబులోంచి డబ్బు తీసిస్తూ, ఈ పుస్తకం కోసం ఓ వంద కాపీలు ఆర్డర్ పెట్టాడు. తన బంధువులకు, స్నేహితులకు ఇలాంటి విషయాలు తెలియజేయడానికే తాను ఈ పుస్తకం కాపీలు వారికి పంచిపెడతానని చెప్పి వెళ్ళిపోయాడు. ఇదంతా ఎందుకు చెప్తున్నామంటే - మనలో చాలామందికి ఇలాంటి విషయాలు తెలియవు. నిజానికి పొదుపుని మించిన సుఖం లేదు. లక్షలు సంపాదించాలంటే ఎంతో స్ట్రగుల్, ఆరాటం, టెన్షన్... లాంటివి ఎన్నో ఎదుర్కోవాలి. అదే పొదుపు వల్ల అయితే అలాంటివేమి లేకుండానే జీవితం నందనవనం చేసుకోవచ్చు. డబ్బు సంపాదించడం అందరికి చేతకాకపోవచ్చు. కాని డబ్బుని ఆదా చేయడం  కొద్ది ప్రయత్నంతో అందరికి సాధ్యమవుతుంది. కాబట్టి డబ్బు ఆదా చేయడం ద్వారా మీరు లక్షాధికారులు కావచ్చు.

ఈ పుస్తకంలో ఇచ్చిన ఆదా మార్గాలన్నీ నిత్యజీవితంలో డబ్బుతో ముడిపడినవే. ఈ పుస్తకంలో చాలా టెక్నిక్‌లను 'మీరు లక్షలు సంపాదించగలరు' అన్న మా మరో పుస్తకంలో ఇచ్చినవే! కాకపోతే చాలామందికి ఈ టెక్నిక్‌లు తెలియవు. ఇందులో ప్రతి టెక్నిక్ మీకు ఎంతో కొంత ఆదాని చేకూర్చేవే సుమా!

ఈ పుస్తకం మీకు డబ్బు ఆదాలో ఎంతో సహకరిస్తుందని ఆశిస్తూ....

మీ

**కె. కిరణ్‌కుమార్**

# నాంది

## పొదుపే లక్షాధికారుల మార్గానికి బంగారుబాట

ఒకరోజు ఉదయం.... బద్ధకంగా 'ఈనాడు' పేపర్ తిరగేస్తుండగా నన్ను ఒక ఐటమ్ ఆకర్షించింది. అదేమిటంటే మీరు సిగరెట్ త్రాగే ఖర్చుని ఆదా చేస్తే పదిహేను సంవత్సరాల తర్వాత లక్ష రూపాయలు మిగులుతాయి అని. అంటే రోజుకు ఒక పాకెట్ సిగరెట్ ఖర్చు (ధర రూ. 20/-) ఆదా చేస్తే పదిహేను సంవత్సరాల తర్వాత లక్ష రూపాయలు పైనే మిగుల్తాయి.

ఆ ఆర్టికల్ చదివిన తర్వాత నాకు ఓ ఐడియా వచ్చింది. అదే ఆర్టికల్‌ని నేను మరింత పొడిగించి నా ఫ్రెండ్ సుందర్రావుకు అన్వయించాను.

సుందర్రావు గవర్నమెంట్ ఆఫీసులో సూపరింటెండెంట్. అతడికి నెలకు పదివేల పైనే జీతం. అయితే అతడికి టీ, కాఫీ, కిళ్ళీ, వక్కపొడి, సిగరెట్ లాంటి సాధారణ అలవాట్లతో పాటు డ్రింక్స్, పేకాట లాంటి అలవాట్లు సైతం ఉన్నాయి.

అతడు నెలకు వాటి మీద ఈ క్రింది టేబుల్‌లో చూపినట్లుగా ఖర్చు పెడతాడు.

| అలవాటు | ఖర్చు | మిగులు | | అదే డబ్బుని పోస్ట్ ఆఫీసులోని సేవింగ్ ఖాతాలో వేస్తే @6% (10 సం॥లకు) |
|---|---|---|---|---|
| | | సం॥రానికి | 10 సం॥లకు | |
| సిగరెట్ | రోజుకో ప్యాకెట్ (రూ. 20/-) | 7200 | 72,000 | 1,00,000 |
| బ్రాంది, విస్కీ, | రోజుకు వంద రూపాయలు | 36,000 | 3,60,000 | 4,50,000 |
| పేకాట | రోజుకు వంద రూపాయలు నష్టం | 36,000 | 3,60,000 | 4,50,000 |
| | | | మొత్తం: | **10,00,000** |

** ప్రతి ఏడూ వడ్డీ రేట్లు మారుతాయి సుమా!*

పై టేబుల్ ప్రకారం మనం రోజూ తీసుకునే సిగరెట్లు, బ్రాందీ, విస్కీలు, పేకాట మానేస్తే కొన్ని వేల రూపాయలు ఆదా అవుతాయి. అంతేకాదు ఆ డబ్బుని ఆ చెడు అలవాట్ల (?) మీద పెట్టే కంటె వాటిని పూర్తి భద్రత గల పోస్టాఫీసు సర్టిఫికెట్ల రూపంలో ఉంచితే మీ డబ్బు తిరిగి పెంపొందుతుంది. అంతేగాక సిగరెట్, బ్రాంది విస్కీల వల్ల ఆరోగ్యం సైతం చెడిపోతుంది. దీనిని మనం ఈ క్రింది విధంగా ఓ పటంలో చూపవచ్చు.




కాబట్టి సిగరెట్లు, మద్యం, పేకాట లాంటి అవలక్షణాల మీద ఎంత డబ్బు ఆదా చేయవచ్చో తెలుసుకున్నారు కదా!

కేవలం ఒక్క సిగరెట్లలోనే అంత డబ్బుని ఆదా చేస్తుంటే నిత్యజీవితంలోని అన్ని అంశాల్లో డబ్బుని ఆదా చేస్తే ఎన్ని లక్షలు ఆదా అవుతాయో అన్న భావం నాలో కదలాడింది.

సరిగ్గా ఆ క్షణమే నాలో ఈ సబ్జెక్టు రాయడానికి బీజం పడింది. దాని ఫలితమే 'నిత్య జీవితంలో డబ్బు ఆదా టెక్నిక్‌లు' అన్న ఈ పుస్తకం.

ఇక సబ్జెక్టులోకి వెళదాం పదండి!







# వార్తాపత్రికలు

## డబ్బు ఆదా చేసే టెక్నిక్

చాలామందికి ఉదయాన్నే న్యూస్ పేపర్‌ని చూడనిదే మత్తు పూర్తిగా వదలదు. ఈ నేపథ్యంలో వార్తాపత్రికలలో డబ్బు ఆదా టెక్నిక్‌ల గురించి తెలుసుకుందాం.

1. మీరు ఒక వార్తాపత్రిక (ఉదాహరణకు 'ఈనాడు'), మీ పక్కింటాయన ఒక వార్తాపత్రిక (ఉదాహరణకు 'హిందు') తెప్పించుకునే ఏర్పాటు చేసుకోండి. సాయంకాలం మీ పేపర్ వారికి, వారి పేపర్ మీకూ మార్పిడి చేసుకోండి. అందువల్ల ఒక పేపర్ వెలకే మీకు రెండు న్యూస్ పేపర్లు చదివిన అనుభూతి కలుగుతుంది.
2. మీరు నిరుద్యోగులయి పేపర్‌ని తెప్పించుకునే స్థోమత లేనపుడు ఒక పని చేయండి. సాధారణంగా 'ఉద్యోగావకాశాల పేజీ'ని ఆయా పేపర్‌వారు వారికి కేవలం మూడు నాలుగు రోజులు మాత్రమే ప్రచురిస్తారు. ఉదాహరణకు ఒక ఆంగ్ల పత్రిక ఉద్యోగావకాశాల పేజిని మంగళ, గురు, శనివారాల్లో మాత్రం ప్రచురిస్తుంది. మీరు ఆయా రోజుల్లో మాత్రమే పేపర్‌ని కొంటే సరిపోతుంది. అందువల్ల మొత్తం నెలంతా న్యూస్‌పేపర్‌ని తెప్పించే అవసరం ఉండదు.
3. ఇక న్యూస్ పేపర్‌కి చెల్లించే బిల్‌లో సైతం మీరు డబ్బుని ఆదా చేయవచ్చు. ఉదాహరణకు ఒక న్యూస్ పేపర్ బిల్లుని మీకు మీ పేపర్ వేసేవాడు ఇలా ఇస్తాడు.

| | |
|---|---|
| మామూలు రోజులు 26 రోజులకు 4.00 చొప్పున | = 104.00 |
| ఆదివారాల్లో 4 రోజులకు 5.00 చొప్పున | = 20.00 |
| | **= 124.00** |
| పేపరు తెచ్చినందుకు | = 16.00 |
| **మొత్తం :** | **= 140.00** |



## డబ్బు ఆదా చేసే టెక్నిక్

పై బిల్లులో కొంతమంది న్యూస్ పేపర్ తెచ్చిచ్చినందుకు ఐదు రూపాయల నుండి ఇరవై రూపాయల దాకా తీసుకుంటారు. ఈ తెచ్చిచ్చిన డబ్బు తప్పించుకోవాలంటే ఒక చిట్కా ఉంది. సాధారణంగా డక్కన్ క్రానికల్, ఈనాడు పేపర్ వారికి 'ఆధారిత ఏజంట్లు' ఉంటారు. మీరు వారిని కలిసి మీకు పేపర్ వేయమని చెప్తే మీకు వారు అసలు ధరకు వేస్తారు. అంతేకాని 'తెచ్చిచ్చిన ధర' ఉండదు. అంటే పై బిల్లులో మీకు దాదాపు రూ. 15/- ఆదా అవుతుంది.

ఇంకొంతమంది పేపర్ తెచ్చిచ్చే బాయ్‌లు పై విధంగా బిల్లు వివరంగా వేయకుండా మొత్తం బిల్లు రూ. 150/- అంటారు. అప్పుడు మీరు ఆ ధరని వివరంగా అడగండి. అంతేకాక కొంతమంది మనం లేని టైంలో పేపర్ వేయకపోయినా వేసినట్లుగా బిల్లు వేస్తారు. అదేమిటంటే మర్చిపోయినట్లుగా నటిస్తారు. ఇంకొంతమంది ఒక నెలలో 4 ఆదివారాలు వస్తే ఐదు వారాలు వచ్చినట్లుగా చూపించి అధికంగా వసూలు చేస్తారు.

కాబట్టి న్యూస్ పేపర్ బిల్లు విషయంలో పైన చెప్పిన జాగ్రత్తలు పరిగణనలోకి తీసుకుంటే మీకు డబ్బు ఆదా అవుతుంది.

### మనీ సేవింగ్ టెక్నిక్స్

బాగా నలిగిపోయి, చినిగిపోయిన నోట్స్‌ని చాలామంది 'ఇక్కడ చెల్లని నోట్లు తీసుకోబడును' అన్న చోట 20 శాతం డిస్కౌంట్‌తో మార్చుకుంటారు. అంటే చెల్లని వంద రూపాయలు నోటు ఇస్తే ఎనభై రూపాయలు ఇస్తారు. కాని చాలామందికి తెలియని విషయం ఒకటుంది. అదేమిటంటే రిజర్వుబ్యాంకులో ఇస్తే పాత లేదా చెల్లని వంద ఇస్తే కొత్త వంద రూపాయలు ఇస్తారు. అదే రిజర్వు బ్యాంకుకు పంపుతారు. మీ పాత నోటుకు సరికొత్త నోటు ఇస్తారు. కాబట్టి ప్రైవేట్ వ్యక్తుల దగ్గర వందకు ఎనభై రూపాయలు తీసుకునే బదులు బ్యాంకుల ద్వారా ప్రయత్నించడం ఉత్తమం.



# రవాణా ఆదాలు

## డబ్బు ఆదా చేసే టెక్నిక్

- గొప్ప కోసం కారు కొనకండి. కేవలం డ్రైవర్ కిచ్చే జీతంతో మనం నెలంతా ఆటోల్లో హాయిగా తిరగవచ్చు. పెట్రోలు, రిపేర్లు, పార్కింగ్, ఇన్సూరెన్స్ లాంటి ఫీజులు మనకు ఉండవు.
- ఒకవేళ కారు కొంటే చిన్న చిన్న రిపేర్లు మీరే చేసుకొనేటట్లు మెకానిజం నేర్చుకోండి. అందువల్ల మీకు డబ్బు ఆదా అవుతుంది.
- గుంటూరు, విజయవాడ లాంటి ఊర్లకు (హైద్రాబాద్ నుండి) వెళ్ళాల్సి వచ్చినప్పుడు బస్సు ప్రయాణం కంటే రైలు ప్రయాణం మేలు. ఎందుకంటే గుంటూరుకి రైలు టిక్కెట్ దాదాపు 100 రూపాయలు కాగా, అదే బస్సు (సూపర్ డీలక్స్)కి వెళ్తే 300 రూపాయలు అవుతాయి. పైగా రైల్లో పదిమందితో పాటు వెళ్ళవచ్చు. వీలైతే (బెర్త్) పడుకొని వెళ్ళవచ్చు. పైగా ప్రయాణ సమయం కూడా తక్కువ.
- ఒక వేళ మీరు సిటీ బస్సులో వెళ్ళాల్సి వస్తే మటుకు మీ దగ్గర కావాల్సినంత చిల్లర ఉంచుకోండి. అందువల్ల కండక్టరు చిల్లరలేదని మీ డబ్బు ఎగ్గొట్టే అవకాశం ఉండదు.
- ఉత్తరప్రదేశ్, భువనేశ్వర్, కాశ్మీర్, హృషికేష్, గంగ లాంటి ఉత్తర భారతదేశ పుణ్య ప్రదేశాలు సందర్శిస్తున్నప్పుడు మీకు అక్కడ హోటళ్ళలో దక్షిణ భారతదేశ వంటకాలు దొరకక పోవచ్చు. దొరికినా బయట హోటళ్ళలో తింటే అనారోగ్య భయం వెంటాడవచ్చు. అలాంటప్పుడు ఆయా ఊర్లలోని ధర్మశాలల్లో వంటపాత్రలు, స్టౌలు మీకు తక్కువ ఖర్చుతో ఇస్తారు. వాటి సహాయంతో మీరు వంట చేసుకోవచ్చు. అందువల్ల మీకు డబ్బు ఆదాతో పాటు రుచికరమైన స్వయంపాకం మరియు ఆరోగ్యం సమకూరుతాయి.
- మీ స్కూటర్ లేదా కారుకి రిపేర్లు చేయిస్తుంటే ఎప్పుడూ ఒకే మెకానిక్ (అదీ బాగా నమ్మకస్తుడైన మెకానిక్ సుమా) మాత్రమే చూపించండి.



## డబ్బు ఆదా చేసే టెక్నిక్

మాటిమాటికి మెకానిక్‌ని మారుస్తుంటే మన వాహనంలో భాగాలు సమతుల్యం లేకుండా పోతాయి. పైగా అసలు సిసలైన పార్ట్‌లు వేసే అవకాశం ఉండదు. కాబట్టి ఎప్పుడూ మీకు బాగా తెలిసిన మెకానిక్ దగ్గరకే మీ వాహనాన్ని సర్వీసింగ్, రిపేర్ల నిమిత్తం తీసుకెళ్ళండి.

- మీ కుటుంబ సభ్యులు ముగ్గురు లేదా నలుగురు కంటే ఎక్కువ ఉన్నప్పుడు బస్సులో కంటే ఆటోలో వెళ్ళడం వల్ల డబ్బు ఆదా అవుతుంది. ఉదాహరణకు బస్సు టికెట్ ఒక్కొక్కరికి ఆరు రూపాయలు చొప్పున నలుగురికి ఇరవై నాలుగు రూపాయలు కాగా, అదే నలుగురికి ఆటోలో కేవలం పదహారు రూపాయలు అవుతుంది.

### వీలైనంతవరకూ కారు కొనకండి



కారు చాలా ఖరీదుతో కూడుకున్నది. దానిని మీరు ఇన్‌స్టాల్‌మెంట్‌లో కొన్నప్పటికీ, నెలకు ఇరవై వేలపైనే ఖర్చవుతుంది. (కారు ఇన్‌స్టాల్‌మెంట్ 10 వేలు, డ్రైవర్ జీతం 2 వేలు, పెట్రోలు 3 వేలు సుమా). నిజానికి మీ డ్రైవర్‌కిచ్చే జీతంతో మీరు నెలంతా సిటీలో హాయిగా ఆటోలో తిరగవచ్చు.

'మరి కారులో తిరిగే ఆనందం పొందడం ఎలా?' అన్న ప్రశ్న రావచ్చు.

అలాంటప్పుడు ఫోన్ చేస్తే కారు మీ ఇంటి ముందు ఉంచే అద్దె దుకాణాలు బోలెడు ఉన్నాయి. ఒక షాపు వాడితో నిరంతరం కాంటాక్ట్స్ పెంచుకుంటే తక్కువ కమీషన్‌కి డ్రైవర్‌తో సహా కారు మన ఇంటి ముందు ఉంటుంది.

పైగా స్వంతకారులో టెన్షన్ ఎక్కువ. రిపేర్లు ఎక్కువ. అదే అద్దె కారులో స్వేచ్ఛ ఎక్కువ. రిపేర్లు మనవి కావు. షెడ్ అవసరం లేదు.



# కిరాణా వస్తువుల కొనుగోలు

- కిరాణా వస్తువులైన పేస్టులు, పౌడర్లు, సబ్బులు, ధనియాల పౌడర్లు, కూల్ డ్రింక్‌లు వగైరా వాటిని ఎప్పుడూ పెద్ద ప్యాకెట్ల (పెద్ద పరిమాణం)లో తీసుకోవడం వల్ల డబ్బు ఆదా చేయవచ్చు. ఉదాహరణకు ధనియాల పౌడర్ 100గ్రాములు రూ.6 కాగా, అదే 1000 గ్రాములు (కిలో) రూ.40 అవుతుంది. అంటే పెద్ద ప్యాకెట్ (కిలో)ని తీసుకోవడం వల్ల దాదాపు రూ.20 ఆదా అవుతుంది. అలాగే కూల్‌డ్రింక్స్ పెద్ద బాటిల్ లీటర్ రూ.20 కాగా కేవలం 300మి.లీ. బాటిల్ ఖరీదు రూ.10 ఉంది. అదేవిధంగా ఒక చాక్లెట్ కొంటే ఒక రూపాయి అవుతుంది. అదే ఒక పెద్ద చాక్లెట్ల పాకెట్ కొంటే ఒకో చాక్లెట్ 75 పైసలు మాత్రమే పడుతుంది. ఇదే విషయం బిస్కట్ల పాకెట్లకు వర్తిస్తుంది. కాబట్టి వీలైనంత వరకు పెద్ద పరిమాణంలో కొనుగోలు చేయడం వల్ల ఆదాలు ఉంటాయి.

- **కొన్ని రకాల ఐటమ్స్ ఢిల్లీ, ముంబాయి, కలకత్తాలాంటి ప్రదేశాలలో చవకే కాకుండా క్వాలిటీ పరంగా బాగుంటాయి. ఉదాహరణకు ఢిల్లీలో చలికి వాడే స్వెట్టర్లు, జెర్కిన్ లాంటివి చవక. పైగా క్వాలిటీ బాగుంటుంది. మీ మిత్రులు లేదా బంధువులు ఏదైనా పనిమీద ఆయా వూర్లకు వెళ్తుంటే డబ్బు ఇచ్చి ఆ వస్తువులను తెప్పించుకోవడం వల్ల మీకు డబ్బు ఆదా కావడమే కాక మంచి నాణ్యత గల వస్తువులు సైతం లభిస్తాయి.**

- చాలామంది లేబిల్ మీద ధర గమనించకుండానే కొంటారు. నిజానికి లేబిల్ మీద ధర గమనించి చూస్తే చాలా డబ్బులు ఆదా అవుతాయి. అలాగే బిల్లులో ప్రతి ఐటమ్ ధరని చెక్‌చేసి, టోటల్ కూడిచేసి సంతృప్తి చెందాకే డబ్బు చెల్లించి బయటకు రండి.





# కారు/మోటారు సైకిల్ ఆదాలు

ప్రస్తుతం వస్తున్న మోటారు సైకిళ్ళు ఒక్కొక్కటి 70 కిలోమీటర్ల మైలేజిని ఇస్తున్నాయి. కాబట్టి అలాంటి దానిని కొనుక్కోండి. కొద్దిగా పెట్టుబడి ఎక్కువైనా మైలేజీని దృష్టిలో పెట్టుకుంటే హీరోహోండా, కవాసాకి లాంటి వాహనాలు ఎక్కువ డబ్బుని ఆదా చేస్తాయి.

- నిజానికి స్కూటర్ లేదా కారు గంటకి 30 నుండి 50 కిలోమీటర్ల స్పీడ్‌ని మెయిన్‌టెయిన్ చేస్తే, మనకు పెట్రోలు ఎక్కువ ఆదా అవుతుంది. అదే గంటకు 60 కిలోమీటర్ల స్పీడ్ దాటితే మటుకు పెట్రోలు ఎక్కువ ఖర్చయి తక్కువ మైలేజిని ఇస్తుంది.

- స్కూటర్ లేదా కారుకి పెట్రోలు పోయించేటపుడు బాగా తెలిసిన పెట్రోలు బంకులోనే పోయించండి. కొన్ని పెట్రోలు బంకుల్లో మీటర్‌ని వేగంగా తిప్పి తక్కువ పెట్రోలు పోస్తారు. అలాంటి వాటిలో పెట్రోలు పోయించకండి. సాధారణంగా ప్రతి టౌన్‌లో పెట్రోలు సరిగ్గా పోసే బంకులు రెండు మూడు ఉంటాయి. మీ మిత్రులనో, కొలీగ్స్‌నో అడిగితే తెలుస్తుంది.

- అలాగే మీ వాహనంతో రోడ్డుమీద తిరిగేటప్పుడు కొన్ని జాగ్రత్తలు తీసుకొంటే పెట్రోలు బాగా ఆదా అవుతుంది. అవి 1. బిజీ రోడ్డులో గమ్యాన్ని చేరడం కంటే తాపీగా, బిజీలేని రోడ్డులో వాహనాన్ని పోనియ్యడం వల్ల మాటి మాటికీ స్పీడ్ బ్రేకర్లు, సిగ్నల్స్ దగ్గర ఆగడం, తిరిగి స్టార్ట్ చేయడం తద్వారా పికప్ కోసం పెట్రోలు ఖర్చు కావడం లాంటి సమస్యలు వుండవు. 2. అలాగే మీరు సిగ్నల్ దగ్గర రెండు నిమిషాలు మించి ఆగాల్సి వచ్చినప్పుడు ఇంజన్‌ని ఆపేయ్యండి. అందువల్ల మీకు ప్రయోజనం ఉంటుంది. 3. ఒకోసారి కొన్ని రోడ్లుపై నుండి కిందికి వంకర్లు తిరుగుతూ ఉంటాయి. అలాంటపుడు మీ ఇంజన్ ఆఫ్ చేసి పోనివ్వండి. అలా ఎత్తుగా పై నుండి క్రిందికి వెళ్తున్నప్పుడు పెట్రోలు వినియోగం ఉండదు కాబట్టి డబ్బు ఆదా అవుతుంది. అయితే మరీ పర్వతలా (కొండలపై నుండి) ఉన్న రోడ్డులో ఈ పద్ధతి అనుసరించకండి. బండి కంట్రోల్ తప్పి ఏక్సిడెంట్స్ అవుతాయి. కేవలం కొద్దిపాటి ఎత్తు నుండి దిగేటపుడు అలాంటి పద్ధతిని అనుసరించడండి.



# వినోద కార్యక్రమాలు

- వీలైనంత వరకూ వినోదాన్ని చక్కటి గాలిలో విహరించి ఆహ్లాదకరంగా ఉండేటట్లుగా చూసుకోండి. ఇంట్లో టీవీ చూసే బదులు సాయంకాలం పార్క్, నడక లాంటివి ఉచితమే కాక మంచి ఆరోగ్యాన్ని ఇస్తాయి.

- అలాగే సినిమా హాళ్ళకు బదులు ట్యాంక్ బండ్, కృష్ణా బ్యారేజీ లాంటి బీచ్‌లు మనకు ఎక్కువ ఆహ్లాదాన్ని ఇవ్వడమే కాక డబ్బుల్ని ఆదా చేస్తాయి. అయినా ప్రకృతి పరంగా వచ్చే వాటిని పూర్తిగా ఎంజాయ్ చెయ్యాలి సుమా!

- **సినిమా హాళ్ళకి వెళ్ళినపుడు బయట బజార్‌లో చిప్స్, బిస్కట్ ప్యాకెట్స్ వగైరా ముందే కొనుక్కొని వెళ్ళండి. సినిమా హాళ్ళో లోపలి తిను బండారాలు ఆకాశాన్నంటే ధరలతో మన కళ్ళకు నీళ్ళు తెప్పిస్తాయి.**

- అలాగే సినిమా హాళ్ళకు వెళ్తున్నప్పుడు ఒక పెద్ద బాటిల్ లేదా చిన్న ఫైబర్ కూలర్‌లో మంచి నీళ్ళు పట్టుకు వెళితే కూల్ డ్రింక్స్ తాగే శ్రమ తప్పుతుంది. పైగా కూల్ డ్రింక్స్‌ని ఒక్కొక్కటి పదిహేను రూపాయలు పెట్టి కొనాల్సిన అవసరం ఉండదు. అలా మన జేబు 'చిల్లు' పడే అవకాశం ఉండదు.

- కళ్ళకు హాని కలిగిస్తూ మెదడులో కాలుష్యాన్ని నింపే టీవి, ఇంటర్నెట్ గేమ్‌ల కంటే మానసిక వికాసాన్ని కలిగించే చెస్, క్యారమ్స్ లాంటి గేమ్‌లు వేయి విధాలా మేలే కాకుండా డబ్బు ఆదా అవుతుంది.

- చక్కటి వినోదానికి లైబ్రరీని ఒక సాధనంగా ఎన్నుకోండి. లైబ్రరీ కేవలం 'ఉచిత'మే కాక మీలో విజ్ఞానాభివృద్ధిని పెంపొందిస్తుంది.



# వినోద కార్యక్రమాలు

- ఖాళీ సమయంలో ఏం చెయ్యాలో తోచకపోతే పాత న్యూస్ పేపర్లు అమ్మే ప్రయత్నం చేయండి. కొంత డబ్బ చేతిలో మిగలడమే కాకుండా మీకు కాలక్షేపం అవుతుంది.

- సినిమా కెళ్ళడానికి బదులుగా ఇంటర్నెట్‌లో సినిమా డౌన్‌లోడ్ చేసుకొని ఇంటిల్లిపాదీ ఆనందించండి. ఖర్చు తప్పుతుంది.

- సినిమా, టీవీలతో కాలక్షేపం చేయడం కంటే మీకు తెలిసిన బంధువులు, మిత్రుల ఇళ్ళకు రాకపోకలు అలవాటు చేసుకుంటే సత్సంబంధాలు నెలకొంటాయి. తద్వారా డబ్బు ఆదాయే కాక మానసిక వికాసం సైతం లభిస్తుంది. రేపు మీరు ఇతర వూర్లకు వెళ్తున్నపుడు మీ పిల్లలను సైతం తాత్కాలికంగా వారింట్లో ఉంచవచ్చు.

- షాపింగ్‌కి వెళ్ళి జేబు ఖాళీ చేసుకునే కంటే వాకింగ్ చేయండి. వాకింగ్ చేయడం వల్ల మీకు జీవిత పథంలో అనేక ఐడియాలు వస్తుంటాయి. ఎలాంటి నిర్ణయాలు తీసుకోవాలో తెలుస్తుంది. పైగా వాకింగ్ ఎలాంటి ఖర్చు లేనిది ఆరోగ్యాన్ని సైతం దివ్యంగా ఉంచుతుంది.

- పార్టీలప్పుడు ఐస్‌ని కొనేకంటే మీ ఇంట్లో డీప్ ఫ్రిజ్ నుండి వాడండి.



## మనీ సేవింగ్ టెక్నిక్

మీరు వంట చేసేటప్పుడు వెడల్పు ఎక్కువ పాత్రలు, ఎత్తు తక్కువ పాత్రలు, ఉపయోగిస్తే గ్యాస్ ఆదా అవుతుంది. వండేటప్పుడు తప్పనిసరిగా మూత వుంచితే గ్యాస్ ఆదా అవుతుంది. వీలైనంతవరకూ కుక్కర్‌లోనే వండితే గ్యాస్ ఆదా అవుతుంది.





# ఫోన్ బిల్లులను ఆదా చేయడం

ఫోన్ బిల్లులను చాలావరకు ఆదా చేయవచ్చు. అదెలాగో చూద్దాం.

- మీరు మాట్లాడే ప్రతి ఫోన్ సమయానికి ఐదు నిమిషాల పరిమితి పెట్టుకోండి.
- మీ కుటుంబ సభ్యులకు సూచనలు ఇవ్వండి. ఫోన్ అవసరమైతే తప్ప చేయవద్దని.
- **రైళ్ళ సమయాలను, వాతావరణ సమయాన్ని కనుక్కోవడానికి ఫోన్ వాడకండి. నిత్యం వచ్చే న్యూస్ పేపర్‌లో ఆ విషయాలు ఉంటాయి.**
- మీరు అవతల వారికి ఫోన్ చేసేటప్పుడు వీలైతే వారి సెల్ నంబర్‌కి చేయండి. అందువల్ల అలవతల వ్యక్తిని ఎక్కడ ఉన్నా పట్టుకోవచ్చు. తద్వారి మన ఫోన్‌కాల్ వృథా కాదు. (ఆ వ్యక్తి ఇంట్లో లేకపోతే ఫోన్ కాల్ వృథాయే కదా)
- మీరు ఇతర ఊళ్ళకు 60 రోజులకంటే ఎక్కువ వెళ్ళాల్సి వచ్చినప్పుడు ఫోన్‌ని డిస్‌కనెక్ట్ చేయించి వెళ్ళండి. కనీస అద్దెని (రూ. 500/-) ని ఆదా చేసుకోండి.
- మీ ఇంటికి వచ్చిన బంధువులు, స్నేహితులు ఫోన్ చేయకుండా ఎస్‌టిడిని లాక్ చేయండి. తర్వాత అసలు మీకు ఎస్‌టిడి సౌకర్యం లేదని చెప్పవచ్చు.
- మీ టెలిఫోన్ బిల్లులను సకాలంలో చెల్లించండి. అందువల్ల గడువు తేది తర్వాత కట్టే జరిమానాని ఆదా చేసుకోండి.
- అవతల వ్యక్తి ఇంట్లో ఏ సమయంలో అయితే ఉంటాడో ఆ సమయంలోనే మీరు ఫోన్ చేయడానికి ప్రయత్నించండి. అందువల్ల కాల్ వృథా అయ్యే సమస్య లేదు.



# ఫోన్ బిల్లులను ఆదా చేయడం

- మీ ఫోన్ బిల్లుని సుదీర్ఘంగా పరిశీలించండి. అందువల్ల మీరు ఏఏ కాల్స్ చేశారో, ఎవరితో ఎక్కువ మాట్లాడారో తెలుస్తుంది. తదనుగుణంగా ఆ కాల్‌మీద భవిష్యత్‌లో ఎక్కువ సమయం వృధా చేయకుండా జాగ్రత్తలు తీసుకోవచ్చు.
- రకరకాల సెల్‌ఫోన్‌ల ఆఫర్స్ పరిశీలించండి. కొన్ని సెల్ కంపెనీలవారు రాత్రి సమయాల్లో ఉచిన కాల్స్ సౌకర్యాలు సమర్పిస్తున్నారు. వాటిని పూర్తిగా సద్వినియోగం చేసుకోండి. ఉదాహరణకు టాటా కంపెనీవారు రాత్రి సమయాల్లో చాలా కొద్ది ఖర్చుతో ఇద్దరి మిత్రులు లేదా బంధువులతో అపరిమితంగా మాట్లాడుకోవటానికి అవకాశం ఇస్తున్నారు.

## మందులు

- మందులు కొనేటప్పుడు ఎప్పుడూ ఎక్స్‌పైరీ డేట్ చూడాలి.
- ఒకవేళ బయట మెడికల్ షాపుల్లో కొనేటట్లయితే హెటిరో, అపోలో వంటి ప్రామాణిక షాపులు ఇచ్చే డిస్కౌంట్లని సద్వినియోగం చేసుకోండి.
- మందులు కొన్నపుడు బిల్లు తప్పనిసరిగా తీసుకోండి. ఒకవేళ ఏదైనా అవకతవకలు సంభవిస్తే చర్యలు తీసుకోవడానికి అవకాశం ఉంటుంది.





# ఊరికి వెళ్లేటప్పుడు ప్రయాణాలలో ఆదా

ముందుగా మీ ప్రయాణం ఏ రోజో ఖచ్చితంగా నిర్ణయించుకోండి. దానివల్ల ఫ్లయిట్, తదితర వాహనాల టిక్కెట్ల రేట్లు చాలా చవకగా దొరికే అవకాశం ఉంటుంది. ఎందుకంటే రెండు మూడు నెలలు ముందు బుక్ చేసుకుంటే కొన్ని ఫ్లయిట్‌లు తక్కువ ధరకే టిక్కెట్లు జారీచేస్తాయి.

మీరు వూరికి వెళ్లేటప్పుడు ఇంట్లో ఎవరినో ఒకరిని ఉంచి వెళ్ళండి. లేదా దొంగల కన్నుపడే అవకాశం ఉంది. అదీ కుదరకపోతే కనీసం మీ చుట్టుప్రక్కల వారికి మీరు వూరు వెళ్తున్నామని చెప్పండి. వారు ఓ కన్ను వేసి ఉంచుతారు.

- ఎయిర్‌పోర్టు లేదా రైల్వేస్టేషన్‌కు వెళ్ళడానికి టాక్సీవాళ్ళు వందల్లో అడుగుతారు. అందుకే ఎవరైనా మిత్రులను ఎయిర్‌పోర్ట్ దాకా డ్రాప్ చేయమని అడగండి.
- లేదా ఎయిర్‌పోర్టు లేదా రైల్వేస్టేషన్ నుండి వచ్చేటప్పుడు టాక్సీని ఎవరితోనైనా షేర్ చేసుకోండి. మీరు క్యూలో నిలబడినపుడు ప్రక్కవారిని ఎక్కడి దాకా వెళ్తున్నారో అడగండి. తదనుగుణంగా ఇద్దరూ కలిసి షేర్ చేసుకోవచ్చు.
- టూర్‌కి వెళ్ళినప్పుడు మీరు హొటల్‌లో ఉండాల్సి వచ్చినప్పుడు, హొటల్ రెస్టారెంట్లు కంటే బయట రెస్టారెంట్లులో టిఫిన్, భోజనాలు చేయడం ఉత్తమం. ఎందుకంటే బయట హొటల్ టిఫిన్‌లు, భోజనాలు చవకగా దొరకవచ్చు.
- అలాగే రూమ్‌లోని టెలిఫోన్‌ని వాడడం మానెయ్యండి. మీ సెల్‌ఫోన్ అన్ని వూర్లలో పనిచేసేటట్లుగా చూసుకోండి.
- మీరు టూరిస్ట్ ప్లేసులకు వెళ్తున్నప్పుడు మీ కుటుంబమే కాక బంధువుల కుటుంబాలనో, స్నేహితుల కుటుంబాలనో కలుపుకోండి. అందువల్ల టూర్లలో సైట్‌సీయింగ్ కోసం సెవన్ సీటర్‌లాంటి కార్లను మాట్లాడుకుంటే డబ్బు ఆదా అవుతుంది.



# ఊరికి వెళ్లేటప్పుడు ప్రయాణాలలో ఆదా

- టూర్లకు వెళ్ళకముందే ఆ వూర్లో చూడాల్సిన ప్రదేశాల గురించి ఇంటర్నెట్‌లోనో, తెలిసిన వారినో కనుక్కొనే ప్రయత్నం చేయండి. అందువల్ల ఆ దూరాన్ని బట్టి ఆటోవారు మిమ్మల్ని మోసం చేసే అవకాశం ఉండదు.
- బయటి పదార్థాలు తిని ఆరోగ్యాన్ని చెడగొట్టుకునే బదులు ప్రామాణిక కంపెనీ వారి బ్రెడ్‌పాకెట్‌ని ఎప్పుడూ మీతో ఉంచుకునే ప్రయత్నం చేయండి. అన్నట్లు మంచినీరు విషయంగా జాగ్రత్తగా ఉండండి. ఎక్కడబడితే అక్కడ నీరు తాగకండి. ఊరిగాని ఊర్లలో జబ్బులు వస్తే అంతే సంగతులు. అందుకే డబ్బులు ఖర్చయిన ప్రామాణిక కంపెనీల వారి వాటర్ బాటిళ్ళు కొనుక్కొని తాగండి.

  అన్నట్లు డాక్టర్ల విషయం వచ్చింది కాబట్టి చెబుతున్నాం. ముందే తలనొప్పి, కడుపునొప్పి మందుల్ని మీతో కావాల్సిన ఊర్లకు తీసుకెళ్ళండి. అందువల్ల డాక్టర్లు అవసరం పెద్దగా ఉండకపోవచ్చు.
- ప్రయాణాలలో ఆయా వూర్లలో దొరికే చవక ఐటమ్‌లను కొనుక్కోవడం ఉత్తమం. ఉదాహరణకు కొన్ని వూర్లలో రాగిచెంబులు చవకగా దొరుకుతాయి. అలాగే ఇంకొన్ని చోట్ల బట్టలు తదితర వస్తువులు చవకగా లభ్యమవుతాయి. మనం మళ్ళీ మళ్ళీ ఆయా వూర్లకు వెళ్ళం కాబట్టి వాటిని పూర్తిగా సద్వినియోగం చేసుకోవడం ఉత్తమం.
- ఇంకొన్ని ఊర్లలో అయితే హోటల్ భోజనాలు ఖర్చులు ఆకాశంలో విహరిస్తుంటాయి. అలాంటప్పుడు మీరే ఓ ఎలక్ట్రానిక్ కుక్కర్ కొనుక్కొని వెళ్ళి హోటల్‌లో పచ్చళ్ళతో వంట చేసుకుని తినడం ఉత్తమం.





# పండుగలు లేనపుడు కొనే ఆదా వస్తువులు

నిజానికి పండుగ, పబ్బాలు లాంటి ప్రత్యేక సందర్భాలలో వాటికి సంబంధించిన వస్తువుల ధరలు ఆకాశాన్నంటుతాయి. కాబట్టి పండుగలు దరిదాపుల్లో లేని సమయంలో ఆయా వస్తువులు తక్కువ ధరకు కొనుగోలు చేసి దాచి, పండుగ సందర్భాలలో ఉపయోగించుకోవచ్చు. ఏఏ వస్తువులకు అలా డబ్బుని ఆదా చేయాలో ఇక్కడ చూద్దాం.

- వర్షాకాలంలో దొరికే గొడుగులను వేసవి, చలికాలంలో కొనడం వల్ల తక్కువ ధరకు పొందవచ్చు.
- **అలాగే రెయిన్ కోట్లు, స్వెట్టర్లని వేసవికాలంలో కొనడం వల్ల ఆదాలు పొందవచ్చు.**
- అలాగే పిల్లలకు కావాల్సిన స్కూల్ యూనిఫారాలు వగైరా జూన్ నెలలో కాకుండా ఏ జనవరి, ఫిబ్రవరి నెలలోనే కొనడం వల్ల ఖచ్చితంగా ఆదా ఉంటుంది.
- అంతేకాక చీరలు, పట్టు లంగాలు లాంటి వాటిని ఆయా పండుగ (సంక్రాంతి, దసరా, దీపావళి) ల్లో కొనే కంటే మామూలు రోజుల్లో కొంటే లాభం ఉంటుంది. ఎందుకంటే ఆయా సందర్భాల్లో వారు డిస్కౌంట్ ఇచ్చినా ధర పెంచి ఇస్తారు. కాబట్టి మామూలుగా రద్దీ లేనప్పుడు ఆయా దుకాణాల్లో మీరు బేరమాడటం సైతం చేసి ఆదా పొందవచ్చు.
- **అలాగే దీపావళి పండుగ సందర్భాలలో వాడే టపాసులు, మందు సామానులు వగైరా వాటిని పండుగ లేని సమయాలలో కొంటే చాలా చవకగా దొరుకుతాయి.**

❖ ❖ ❖



# ఫంక్షన్‌ల కోసం క్యాటరింగ్ ఆర్డర్ చేసేటప్పుడు

1. ముందుగా మీకెన్ని ఐటమ్స్ కావాలో నిర్ణయించు కోండి. అంతేకాని క్యాటరింగ్ వారు చెప్పే ఐటమ్స్ గురించి పట్టించుకోకండి. వారు వీలైనన్ని ఎక్కువ ఐటమ్స్ చెప్తారు.
2. వీలైతే స్వీట్, అప్పడాలు వగైరా తేలికపాటి పదార్థాలను వారికి ఆర్డర్ ఇవ్వకండి. వాటిని బంధువుల సహకారంతో మీరే చేయవచ్చు. అందువల్ల క్యాటరింగ్ వారు వేసే అధిక ఖర్చు తప్పుతుంది.
3. వీలైనంతవరకూ బఫే పద్ధతినే అనుసరించండి. దానివల్ల ఎవరికీ కావల్సింది వారు తీసుకుంటారు. వృథా అవదు.
4. చాలామంది 100 ప్లేట్లకని ఆర్డర్ ఇస్తారు. కాని మనం ఫంక్షన్ హడావిడిలో ఉండడం చూసి క్యాటరింగ్ వారు 80 ప్లేట్లే ఉంచి 100 ప్లేట్లు అయ్యాయని చెప్పి మోసం చేసే ఆస్కారం ఉంది. కాబట్టి ప్లేట్‌లను లెక్కపెట్టడానికి ప్రత్యేకంగా ఒక మనిషిని ఉంచండి. వారి మోసాన్ని అరికట్టవచ్చు.

## చివరిదశలో అల్లాడిపోయిన మహానటి సావిత్రి

తెలుగు సెల్యులాయిడ్ తెరమీద తన నటనతో ఎందరో ప్రేక్షకులను అలరించిన మహానటి సావిత్రి చివరిదశలో డబ్బుకై కటకటలాడారు. ఆమెకు దానధర్మాలు చేయడం అలవాటు. అలా తనకంటూ పైసా మిగుల్చుకోకుండా అడిగినవారికి లేదనకుండా ఇచ్చేవారు అలాంటి మహానటి చివరకు డబ్బులేమితో బాధపడి మరణించడం నిజంగా బాధాకర విషయం. తను సంపాదించిన దాంట్లో ఏమాత్రం ఆదా చేసినా ఆమె చివరి రోజులలో అంతగా బాధపడాల్సిన అవసరం ఉండేది కాదని ఆమె సన్నిహితుల అభిప్రాయం. అయితే ఇతరులకు సహాయపడడమే మహానటి సావిత్రి ఉద్దేశం. అందువల్ల ఆమె ఏనాడూ తాను చేసిన పనికి బాధపడలేదు. దటీజ్ సావిత్రి!



# పుస్తకాలు

సాధారణంగా పుస్తకాల మీద మనం అడిగితే కాని చాలామంది డిస్కౌంట్ ఇవ్వరు. అందువల్ల మీరు ఏ పుస్తకం కొన్నా డిస్కౌంట్‌ని అడగడం మర్చిపోవద్దు. సాధారణంగా గైడ్లు, సాధారణ పుస్తకాల మీద డిస్కౌంట్ ఎక్కువ ఉండగా, పాఠ్యపుస్తకాల మీద తక్కువ ఉంటుంది. కొంతమంది షాపుదారులు పాఠ్యపుస్తకాల మీద డిస్కౌంట్ ఇవ్వడానికి నిరాకరిస్తారు. తమకే రాదని, కస్టమర్‌కేం ఇవ్వాలని వాదిస్తారు. కాని తప్పనిసరిగా వాటిమీద వారికి లభించే డిస్కౌంట్‌లో కొంత భాగాన్ని మనం అడిగి తీసుకోవచ్చు.

- మీరు కొనబోయే పుస్తకం ప్రచురణ సంస్థ అడ్రసు కనుక అదే నగరంలో ఉంటే మీరు నేరుగా ఆ ప్రచురణ సంస్థ ఆఫీసుకెళ్ళి పుస్తకాన్ని కొనుగోలు చేస్తే మీకు ఎక్కువ డిస్కౌంట్ లభించే అవకాశాలు ఉంటాయి.

  ఏడాదికి కావాల్సిన స్టేషనరీ అంతా ఒకేసారి హోల్‌సేల్ షాపులో తెచ్చుకోండి. అందువల్ల ఎంతో ఆదా అవుతుంది. ఉదాహరణకు హైద్రాబాద్‌లోని నారాయణగూడలోని పద్మావతి స్టేషనరీ షాపులో స్టేషనరీ ధరలు తక్కువ ఉంటాయి. అలాంటి షాపుల్లో కొంటే మీకు బోలెడు ఆదా లభ్యమవుతుంది. మనం నిత్యం వాడే కవర్లు బయట రెట్టింపు ధరకు దొరికితే, ఆ పద్మావతి షాపులో హోల్‌సేల్‌గా కొంటే సగం ధరకే దొరుకుతాయి. కాబట్టి మీ పిల్లలకు కావల్సిన స్టేషనరీ, నోట్ పుస్తకాలు వగైరా ఒకేసారి కొని భద్రపరచండి.

- నోట్ పుస్తకాలలో లేపాక్షి లాంటివి చవకే కాకుండా నాణ్యత పరంగా బాగుంటాయి. అయితే కొంతమంది వేరే ప్రచురణకర్తలు నోట్ పుస్తకాలలో సైతం మోసం చేస్తారు 200 పేజీల నోట్ పుస్తకం సాధారణంగా 192 పేజీలు ఉంటాయి. అయితే కొంతమంది పుస్తకం మీద 200 పేజీలు అని రాసి కేవం 180 పేజీలనే ఉంచుతారు. అలా మనం డబ్బుని నష్టపోకుండా చూసుకోవాలి. సాధారణంగా లేపాక్షి, నవనీత్ లాంటి పుస్తకాల నోట్‌పుస్తకాలలో పేజీలు కరెక్ట్‌గా ఉంటాయి. మిగతా లోకల్ పబ్లిషర్ల పుస్తకాల పేజీ విషయంలో మాత్రం మీరు జాగరూకతతో వ్యవహరించాల్సి ఉంటుంది.

❖ ❖ ❖



# డాక్టర్ ఫీజులు, మందులు ఆదా

డాక్టర్ ఫీజుని బాగా నిలువ చేయాలంటే మీరు హెల్త్ ఇన్సూరెన్స్ పాలసీ తీసుకుంటే లక్ష రూపాయలు లేక హాస్పిటల్ ఖర్చులు మీరు చెల్లించాల్సిన అవసరం లేదు.

- కొంతమంది డాక్టర్లు ఎక్స్‌రేతో పోయే దానికి యం.ఆర్.ఓ. (దీని ఖరీదు కనీసం మూడు, నాలుగు వేలు) తీయించమంటారు. అలాంటప్పుడు రెండో డాక్టర్ అభిప్రాయం తెలుసుకోండి. అందువల్ల మీకు యం.ఆర్.ఓ. మీద డబ్బు ఆదా అయ్యే అవకాశం ఉండవచ్చు.
- **మీ దగ్గర బంధువు డాక్టరో లేక మెడికల్ రిప్రజంటేటివ్ అయితే మటుకు మీరు కొన్ని రకాల మందుల శ్యాంపిల్స్‌ని వారి దగ్గర ఉచితంగా పొందవచ్చు.**

## పేపర్లలో ప్రకటనలు ఇవ్వడం

చాలామంది తమ ఇళ్ళు అమ్మడానికో, లేదా వధువు కోసమో తమ ప్రకటనలను అలా నేరుగా పేపర్లవారికిచ్చే కంటే యాడ్ ఏజన్సీలకిస్తే మీరిచ్చే ప్రకటనల ధరలో పదిశాతం డిస్కౌంట్ లభిస్తుంది. సహజంగా న్యూస్ పేపర్ వాళ్ళు యాడ్‌లను సేకరించి ఇచ్చినందుకు యాడ్ ఏజన్సీలకు కొద్దిశాతం డిస్కౌంట్ ఇస్తారు. అందుకే కొద్దిశాతం వారు కస్టమర్లకి ఇస్తారు. ఈ యాడ్ ఏజన్సీల వారికి ఒక ఫోన్ చేస్తే చాలు, వారే మన ఇంటికి వచ్చి ప్రకటనలు తీసుకెళ్తారు. అలా యడ్ ఏజన్సీలను కాంటాక్ట్ చేయడం వల్ల డిస్కౌంట్ రూపంలో డబ్బు ఆదాయే కాకుండా కాలయాపన సైతం తగ్గుతుంది.

*అదేవిధంగా మీరు లైఫ్ ఇన్సూరెన్స్, చిట్ తీసుకోవాలన్నా నేరుగా ఆఫీసులకెళ్ళే కంటే ఏజంట్లని పట్టుకోవడం వల్ల మీకు కమీషన్ వస్తుంది. చాలామంది ఇన్సూరెన్స్ ఏజంట్‌లు మొదటి సంవత్సరంలో తమ కొచ్చే మొత్తం కమీషన్ కస్టమర్‌కే ఇస్తారు. అయితే ఈ విషయం గురించి మీరు వారిని గట్టిగా అడగాలి. అడగకపోతే వారు విషయం మీకు తెలియదనుకొని వదిలేస్తారు.*



# స్థలాలు, ఇళ్ళు కొనడం, అమ్మడం

ప్రస్తుతం నగరాలలో స్థలాలను కొనడం, ఇల్లు కట్టడం లాంటివి సర్వసాధారణం. ఈ ఇల్లు, స్థలం కొనడంలోని ఆదాల గురించి తెలుసుకొందాం.

1. ముందుగా అసలు ఆ స్థలం వారు ఎందుకు అమ్ముతున్నారో ఆరా తీయండి. చాలామంది స్థలం టైటిల్ వివాదాల వల్ల అమ్ముతారు. లేదా వాస్తు లోపభూయిష్టంగా ఉన్నా అమ్మవచ్చు. అలాంటి స్థలాలు కొని మీ డబ్బు, శ్రమ వృథా చేసుకోకండి.
2. మీ స్థలం బ్రోకర్‌ని కలుసుకోవద్దు. దానికి బదులు న్యూస్‌పేపర్లలో పడే రియల్ ఎస్టేట్ కాలమ్‌లో వెతుక్కోండి. ఎందుకంటే బ్రోకర్ వెతికిపెట్టే స్థలం పెట్టుబడి మీద మనం రెండు నుండి ఐదు శాతం వరకూ కమిషన్ చెల్లించాల్సి ఉంటుంది. అదే న్యూస్ పేపర్‌కయితే కమీషన్ గొడవ ఉండదు.
3. మీరు చూసిన సైట్ లేదా ఇళ్ళని బేరం ఆడే విషయంలో లౌక్యం ఉపయోగిస్తే డబ్బు ఆదా అవుతుంది. ఎంత గొప్ప సైట్, అపార్ట్‌మెంట్ లేదా ఇంటికైనా ఏదో ఒక వాస్తు లోపం ఉంటుంది. అందువల్ల మీరు బేరం ఆడేటప్పుడు ముందు ఆ లోపం గురించి హైలైట్ చేస్తూ మాట్లాడండి. అందువల్ల ధర తగ్గించి ఇచ్చే అవకాశం ఉంది. "ఆ ఇంటికి ఫర్లాంగ్ దూరంలో డ్రైనేజ్ ఉంది కదా! ఆ నీళ్ళు ఇంట్లో బోరింగ్ నీటిలో కలిసిపోతాయి. అందువల్ల నీళ్ళు కలుషితమైపోతాయి" అన్నట్టుగా ప్రతికూల అంశాల గురించి మాట్లాడితే మీకు స్థల విషయంలో బోలెడు ఆదా అవుతుంది.
4. సాధారణంగా మీరు సిటి మధ్యలో సైట్ కొనేకంటే వూరి చివర కొనడం వల్ల తక్కువ ధరకు వస్తాయి. పైగా ఆ వూరి చివర సైట్లు వేగంగా పెరుగుతాయి. ఉదాహరణకు చిక్కడపల్లిలో గజం యాభై వేలు పెట్టే కన్నా ఉప్పల్, బోడుప్పల్‌లో పది, పదిహేను వేలు పెట్టి కొంటే నాలుగు సంవత్సరాల తర్వాత చిక్కడపల్లిలో గజం డెబ్భై వేలు ఉంటుంది. అదే ఉప్పల్, బోడుప్పల్‌లో పాతికవేలు అవుతుంది. కాబట్టి మీరు డబ్బు ఆదా చేసుకోవాలంటే వూరి పొలిమేరల్లో సైట్ లేదా ఇళ్లు కొనడం మంచిది. చాలామంది పాత ఇళ్ళను కొనడానికి సిద్ధం అవుతారు.



# ఇళ్ళు కొనడం / ఇళ్ళ ఆదాలు

- మీరు ఇల్లు కొనే ముందు చుట్టుప్రక్కల వారిని అక్కడ పరిసరాల గురించి తెలుసుకోండి. ఒకవేళ ఆ ఇంట్లో అద్దెకున్నవారు ఉంటే వారినే అడగండి. మంచినీళ్ళ సమస్యలు, దొంగల భయం, డ్రైనేజీ నీళ్ళు గురించి వాళ్ళకు తెలిసినట్లుగా ఎవరికీ తెలియదు.
- అదే మీరు అపార్ట్‌మెంట్ కొనదలచుకుంటే మూడు బెడ్‌రూమ్‌ల ఫ్లాట్ తీసుకోవడానికి ప్రయత్నించండి. చాలామంది తక్కువ పెట్టుబడిలో వస్తుంది కదా అని సింగిల్ లేదా డబుల్ బెడ్‌రూమ్ ఫ్లాట్ తీసుకోవడానికి ప్రయత్నిస్తారు. కాని భవిష్యత్తులో ఆ నిర్ణయం మనకు చాలా బాధాకరంగా తయారవుతుంది. పెరిగిన పిల్లలు, వ్యాపార విస్తరణ వల్ల మూడు బెడ్‌రూమ్ ఫ్లాట్ అవసరం ఉంటుంది. ముందే జాగ్రత్త పడితే భవిష్యత్‌లో ఏమాత్రం వగచాల్సిన అవసరం ఉండదు.
- మీ ఇంటికి సున్నాలు, పెయింటింగ్ వేయించుకోదలచుకుంటే వీలైనంతలో మీరే వేసుకోవడం ఉత్తమం. అందువల్ల దుబారాతో పాటు సంతృప్తి కలిసొస్తుంది.
- మీరు ఎప్పుడూ ఇళ్ళు కొన్నా, అమ్మిన సంవత్సరం ప్రారంభంలో కొనండి లేదా అమ్మండి. అందువల్ల ఆదాయ పన్ను చట్టాల ప్రకారం సంవత్సరం లోపు ఇంకో ఇళ్ళు కొన్నా పన్ను ఉండదు.
- అదే మీరు అద్దెకు ఓ ఇంట్లో ఉంటే, ఆ ఇంటి ఓనర్లతో సత్సంబంధాలు పెట్టుకోండి. వారి కుటుంబంతో మమేకమైపోండి. దాని వల్ల ఇంటి ఓనర్ ప్రతి సంవత్సరం అద్దె ఎక్కువ పెంచకపోవచ్చు.
- మీకు స్వంత ఇల్లు వుండే కూరగాయలు పండించండి. ఈ కరువు రోజుల్లో పూలు, కూరగాయలు కొనాలంటే ఎక్కువ ఖర్చు పెట్టాల్సి వస్తుంది కూడా!
- మీరు విదేశాలకో, ఇతర దూర ప్రదేశాలకో వెళ్తుంటే, మీ ల్యాండ్‌లైన్ టెలిఫోన్‌ని కొన్నాళ్లు నిలుపువేయమని టెలిఫోన్ డిపార్ట్‌మెంట్ వారికి ఆర్డర్ చేయండి. దానివల్ల డబ్బు ఆదా అవుతుంది.



# ఇల్లు, రిపేర్లు, వగైరా

1. ఇంటికి సంబంధించిన చిన్న చిన్న రిపేర్లని ఇంటి రిపేర్ల పుస్తకాల సహాయంతో నేర్చుకోండి. లేకపోతే కాంట్రాక్టర్లు, ప్లంబర్లు మిమ్మల్ని ముంచేస్తారు.

2. ఒకవేళ మీ ఇంట్లో చాలా వస్తువులు ఒకేసారి రిపేర్‌కి వచ్చాయనుకోండి. ఓ ప్లంబర్‌ని పిలిచి అన్ని ఒకేసారి రిపేర్‌కి ఇస్తే మీరు తక్కువ ధరకు బేరమాడవచ్చు. అంటే ఒక్కో వస్తువు కాక మొత్తం వస్తువులను ఇస్తే మీకు తక్కువ ధరకు రిపేర్ చేయవచ్చు.
   ఇంటి రిపేర్లు చేయించుకొనేటప్పుడు ఎప్పుడూ మొత్తం బిల్లుని అడ్వాన్స్‌గా ఇవ్వకండి. పని అంతా సంతృప్తికరంగా చేస్తేనే డబ్బు ఇస్తామని కాంట్రాక్టర్‌తో చెప్పండి. అందువల్ల సరిగా చేకపోతే డబ్బులు ఇవ్వరేమోనని భయపడి బాగా చేసే అవకాశం ఉంటుంది.

3. మీ ఇంటికి దక్షిణం వైపున చెట్లని నాటండి. అందువల్ల వర్షపు రుతువులో ఆకులు వూడిపోయి, వేసవిలో మళ్ళీ చిగురించి మీకు చల్లదనాన్ని ఇస్తాయి. అందువల్ల ఎక్కువగా ఏసి, ఫ్యాన్‌లను ఉపయోగించాల్సిన అవసరం ఉండదు.

- ఇవాళ, రేపు ఓ ఎలక్ట్రిక్ ఫ్యూజ్ వేయాలన్నా, నీళ్ళు కారుతున్న పంపు బాగు చేయాలన్నా వందలు, వందలు అడుగుతున్నారు రిపేర్ వారు. అందుకే మనం ఆ పనులన్నింటినీ వీలైనంతగా నేర్చుకోవడం ఉత్తమం.
- ఎలక్ట్రిక్, ఇతర భారీ పరికరాలు కొన్నప్పుడు వారంటీ రసీదులు జాగ్రత్త చేయండి. ఏవైనా రిపేర్లు వస్తే తిరిగి మనం వారిచేత బాగు చేయించుకోవచ్చు.
- స్కూటర్, కారు, ఇంటి తాళాలను ఎప్పుడూ ఒక సెట్‌ని అదనంగా ఉంచుకోవడం మేలు. ఒకవేళ మన తాళం చెవి పోయినా ఎక్కువ ఖర్చు లేకుండా బయటపడవచ్చు.



# వాస్తు, జ్యోతిష్యం

వాస్తు, జ్యోతిష్యాలను నమ్మేవారు ఉంటారు. నమ్మనివారూ ఉంటారు. అయితే వాస్తు, జ్యోతిష్యాలను నమ్మేవారు ఎవరు పడితే వారి దగ్గరకు వెళ్ళి సమయం, డబ్బు నాశనం చేసుకుంటారు. కాబట్టి వాస్తు, జ్యోతిష్యాల కోసం రోడ్డు మీద, హోటల్‌లో ఎవరు కన్పిస్తే వారి దగ్గరకు వెళ్ళడం వల్ల జేబుకు చిల్లు పడే అవకాశం ఉంది.

- **మంచి పరిజ్ఞానం గల వాస్తు శాస్త్రజ్ఞుల దగ్గరకు వెళ్ళండి.** నిజానికి చక్కటి పరిజ్ఞానం గల వాస్తు శాస్త్రజ్ఞులు ఎప్పుడూ ప్రజల చేత ఎక్కువ డబ్బు ఖర్చు చేయించరు. వారి సమస్యలను నిశితంగా పరిశీలించి సలహాలు ఇస్తారు.
- ఈ మధ్య చైనీస్ వాస్తు 'పెంగ్‌షూయ్' ప్రాముఖ్యాన్ని సంతరించుకుంటోంది. ఆ వాస్తులో మన వాస్తులా పడగొట్టడం, కూలగొట్టడం, తిరిగి పునర్నిర్మించడం లాంటివి ఉండవు. కేవలం కొద్దిమార్పులు (కళ్ళకు వైబ్రేషన్స్ కలిగించే రంగులు, మొక్కలు, అద్దాల ద్వారా) చేసుకొని వాస్తుని సరిచేసుకుంటు న్నారు.
- ఈ నేపథ్యంలో ప్రజలు కుహనా వాస్తు శాస్త్రజ్ఞులను నమ్మి డబ్బు, సమయం వృథా చేసుకోకుండా ఉండడానికి గాను ఈ రచయిత 'A to Z పెంగ్‌షూయ్' అనే పుస్తకాన్ని వెలువరించారు. ఆ పుస్తకంలో దాదాపుగా ప్రతి వాస్తు సమస్యకి పరిష్కారం ఇవ్వడం జరిగింది. ప్రజలు తమంతట తామే వాస్తు సమస్యలను పరిష్కరించుకునేటట్లుగా బొమ్మలతో వివరణ ఇవ్వడం జరిగింది. కేవలం యాభై రూపాయలు గల ఈ పుస్తకం ద్వారా మీరు అనేక వాస్తు సమస్యలను పరిష్కరించుకొని డబ్బుని ఆదా చేసుకోగలరు. (ఈ పుస్తకం మొదట పేజీలో ఉన్న అడ్రసు అయిన 'శ్రీ వైభవ పబ్లికేషన్స్, హైదరాబాద్'లో ఆ పుస్తకం లభ్యం అవుతుంది).

## మనీ సేవింగ్ టెక్నిక్స్

**మీ టెలివిజన్‌లో ప్రోగ్రామ్‌లను చూడనప్పుడు ఆఫ్ చేయండి. చాలామంది వంటింట్లో ఉంటూ టీవీని అలాగే వదిలేసి పోతారు. ఫలితంగా విద్యుచ్ఛక్తి వృథా అవుతుంది.**



# కూరగాయలు, పండ్లు వగైరా

- మీ ఇంటికి ఐదారు కిలోమీటర్ల దూరంలో రైతుబజార్ లేదా కూరగాయల మార్కెట్ (మోండా లేక మొజాంజాహి) ఉన్నట్లయితే సరదాగా నడిచి వెళ్ళి ఆటో / స్కూటర్‌లో నాలుగైదు రోజులకు సరిపడా కూరగాయల్ని ఒకేసారి తెచ్చుకుంటే మీకు కనీసం పది రూపాయలు ఆదా అవుతాయి. ఇది అందరికి తెలిసిన సలహానే. అయినప్పటికీ చాలామంది పాటించరు. పాటిస్తే డబ్బు ఆదాతో పాటు నాణ్యత సైతం మెరుగుపడుతుంది.

- *పండ్లలో యాపిల్ కంటే జామపండ్లు మంచివి. చాలామంది మార్కెట్‌లో అధిక ధర పలుకుతున్నా యాపిల్ అలవోకగా కొంటారు. ఒక్కో యాపిల్‌కి పెట్టే ధరలో కనీసం అరడజను జామపండ్లు వస్తాయని తెలిసినా వాటిని చులకనగా చూస్తాం. నిజానికి పోషక విలువల్లోగాని, రుచిలో గాని జామపండు ఎట్టి పరిస్థితుల్లోనూ యాపిల్‌కి తీసిపోవు. ఉదాహరణకు వంద గ్రాములు బరువు తూగే యాపిల్‌లో కంటే అంతే బరువు గల జామపండులో మూడు గ్రాములు ఇనుము అధికంగా లభిస్తుందంటే మీకు ఆశ్చర్యం కలిగించక మానదు. అలాగే అధిక ధర పలికే మామిడిపండు కంటే తక్కువ ధరలో లభించే బొప్పాయి పండులో ఇనుము 0.1 శాతం అదనం. ఈ విధంగా తక్కువ ధర కలిగి అధిక పోషక విలువలు కలిగిన పండ్లని కొన్నట్లయితే ఒంటికి – జేబుకి రెండింటికీ ఆరోగ్యం కదా!*

- ఒక్కోసారి కొన్ని రకాల కూరగాయలు చాలా తక్కువ ధరకు రైతులు గిట్టుబాటు లేక అమ్మేస్తారు. ఉదాహరణకు టొమాటాలు కిలో రెండు రూపాయలకే అమ్మిన ఉదాహరణలు ఎన్నో. అలాంటప్పుడు వాటిని కిలోలకు కిలోలు కొని టొమాటో పచ్చడి తయారుచేసుకోవడం ద్వారా డబ్బుని ఆదా చేయండి.



# కుటుంబంలో తగ్గించుకోవాల్సిన ఖర్చులు

- మొదటగా కుటుంబంలో కూల్‌డ్రింక్స్, ఐస్‌క్రీమ్‌లు ప్రోత్సహించకండి. వాటిలో ఎన్నో రకాల రసాయనాలు కలుపుతారు. వాటివల్ల ఆరోగ్యం చెడిపోవడమే కాకుండా డబ్బు వృథా అవుతుంది. కావాలంటే అవే కూల్‌డ్రింక్స్, ఐస్‌క్రీమ్‌లను ఇంట్లోనే తయారుచేయండి. అందువల్ల ఖర్చు మిగలడమే కాకుండా ఆరోగ్యం కూడా భేషుగ్గా ఉంటుంది.

- కుటుంబంలో వృద్ధులను ఆదరించండి. వారే పిల్లలను చూసుకుంటారు. విద్యాబుద్ధులు నేర్పిస్తారు. వారిని వృద్ధాశ్రమంలో చేర్పిస్తే పాపం తగలడమే కాక పిల్లల ఆలనాపాలనా చూసుకునే వారు కరువవుతారు.

- పిల్లల ఆటవస్తువులు ఖరీదైనవి. అందువల్ల ఏ ఆట వస్తువులైతే వారికి ఎక్కువ కాలం మన్నికగా వుంటాయో వాటిని కొనేయ్యండి. త్వరగా ధ్వంసమయ్యే వాటిని నివారించండి. అంతేకాకుండా మీ పిల్లల బొమ్మల్ని పక్కింటివారికో, ఇతరులకో ఇచ్చి, వారి బొమ్మల్ని మీ పిల్లలకు మార్పిడి చేయించండి. అందువల్ల వైవిధ్య రకాల వస్తువులు లభ్యం కావడమే కాకుండా ఖర్చు తగ్గుతుంది.

- మీకు ఒకే అబ్బాయి వుంటే కాస్త చవక డ్రస్‌లు కొనండి. అదే ఇద్దరు కంటే ఎక్కువ వుంటే పెద్దవాడికి చక్కటి డ్రస్సు కొనండి. ఆ ఖరీదైన డ్రస్సే చిన్నవారికి కూడా సరిపోతుంది.

- మీ కుటుంబం, పిల్లల పేర చక్కటి ఇన్సూరెన్స్ పాలసీ తీసుకోండి. డబ్బులు అవుతాయని దానిని మానెయ్యకండి. భవిష్యత్తులో ఆ పాలసీ మీకు శ్రీరామరక్ష లాంటిది.



# ఆడియో, వీడియో క్యాసెట్‌లు

- ఆడియో, వీడియో క్యాసెట్లని, సిడిలను మీరు నేరుగా హోల్‌సేల్ షాపుల్లో కొంటే మీకు 10 శాతం నుండి 20 శాతం దాకా డిస్కౌంట్ వస్తుంది. ఉదాహరణకు మీ ఇంటి ప్రక్కనున్న షాపుకంటే కోఠి, హనుమాన్ టెక్డి (హైదరాబాద్) దగ్గర హోల్‌సేల్ షాపుల్లో కొంటే డిస్కౌంట్ లభించే అవకాశం ఉంది.
- పాత సినిమా ఆడియో, సిడిలకు డిమాండ్ తక్కువ. అవి ఎక్కువకాలం వారి షాపుల్లో మగ్గిపోవాల్సిందే! అందువల్ల మీకు పాత ఆడియో, వీడియో ఆడియో క్యాసెట్‌లు, సిడిలు కావాల్సి వస్తే వాటిని వీలైనంత తక్కువకు బేరం ఆడవచ్చు.
- ఆడియో, వీడియో క్యాసెట్లలో కొన్ని నాసిరకం ఉంటాయి. అవి మన టేప్‌రికార్డర్‌లో నాలుగైదుసార్లు ఉంచగానే పాడవుతాయి. కాబట్టి కాస్తా ఎక్కువ డబ్బులైనా ప్రామాణిక కంపెనీల క్యాసెట్‌లు (ఆదిత్య, సుప్రీమ్, టి–సిరీస్) కొంటే దీర్ఘకాలం మన్నిక ఉంటాయి.

## సేవింగ్స్ (డబ్బు ఆదాలు)



- మీ చిల్లర డబ్బుల్ని ఒక ముంతలో వేయండి. వాటిని తిరిగి బ్యాంక్‌లో వేస్తే చిన్న మొత్తాలే పెద్ద మొత్తాలుగా మారుతాయి.
- మీ చేతిలో డబ్బు వేగంగా కరిగిపోతుంటే నెల నెలా మార్గదర్శి లేదా విజయ్ చిట్‌ఫండ్ (నమ్మకమైన వాటిలోనే సుమా)లో చిట్ వేయండి. అలా చిట్ కడితే మనం తప్పనిసరిగా డబ్బుని అటు వినియోగిస్తాం. లేకపోతే ఆ డబ్బు సైతం మన చేతిలోనే ఏదొక ఖర్చు రూపేణా కరిగిపోతుంది.
- మీరు కోపరేటివ్ బ్యాంకులో డబ్బు డిపాజిట్ చేయదలిస్తే అందులో లక్ష దాకా ఇన్సూరెన్స్ కవరేజీ ఉంటుంది. అందువల్ల బ్యాంకులో వేసే ముందు అలాంటి రక్షణ పథకాన్ని గురించి కనుక్కొని మరీ వేయండి.
- పుట్టిన రోజు లేదా ఇతర సందర్భాలలో మీకు నగదు బహుమతిగా వచ్చినట్లయితే వాటిలో సగం ఎప్పుడూ బ్యాంక్‌లో వేయండి. అందువల్ల ఆ డబ్బుని మీరు ఖర్చు పెట్టలేదు. ఆ డబ్బే కొంతకాలం తర్వాత పెద్ద మొత్తంగా మారుతుంది.



# బహుమతులు ఇవ్వడం

మనం వెళ్లే అనేక ఫంక్షన్‌లకు, పెళ్ళిళ్ళకు ఎప్పుడూ గిఫ్టలను ఇవ్వాల్సి వస్తుంది. ఈ నేపథ్యంలో కొన్ని జాగ్రత్తలు తీసుకుంటే గిఫ్టల ద్వారా బోలెడు డబ్బు ఆదా అవుతుంది.

1. మీకు వీలైతే గిఫ్టలను మీరు తయారుచేయండి. షాపులలో కొనే గిఫ్టల కంటే మీరు స్వంతంగా తయారుచేసిన గిఫ్టలను సందర్శకులను అలరిస్తాయి.

2. కొంతమంది ఏమి చేయాలో తెలియక 'డబ్బు' ఇస్తారు. కాని డబ్బుని వారు ఇతర డబ్బుతో కలిపేస్తారు. అందువల్ల మీ వునికి ఎప్పుడూ జ్ఞాపకం ఉండదు. అందుకే వీలైనంతవరకు వస్తు రూపంలో బహుమతులను ఇవ్వడం సమంజసం.

## విద్య, పాఠ్యపుస్తకాలు వగైరా

- ఉపయోగించిన పుస్తకాలు ఎవరి దగ్గర్నుంచైనా తీసుకొని వాడండి. మీ కాలేజీ / స్కూల్ లైబ్రరీలో డిపాజిట్ కట్టి పుస్తకాలు ఇంటికి తెచ్చుకోండి.

- మీ పిల్లలకు కథలు పుస్తకాలు వగైరాలను మీరు పుస్తకాల షాపుల్లో బోలెడు డబ్బు పెట్టి కొనే బదులు ప్రతి ఆదివారం మీ సిటిలో ఫుట్‌పాత్ మీద పెట్టి అమ్మేవారి దగ్గర చవకగా కొనుగోలు చేయండి. పది రూపాయల పాత కథల పుస్తకాలు అక్కడ మీకు రూపాయి, రెండు రూపాయలకు దొరుకుతాయి. పిల్లలు సైతం అవి కథల పుస్తకాలు అయితే చాలు, కొత్తవా, పాతవా అన్న విషయం పట్టించుకోరు.

---

**మీ దగ్గర లక్షలు లేవని నిరాశపడకండి. మీ మనసు ఎరిగి ఖర్చులు తగ్గించి మీకు ఓదార్పునిచ్చే మీ భార్యే మీకు కోటిరూపాయలు ఆస్థి కింద లెక్క!**



# బంగారు నగలు

నెక్లస్ మొదలైన రాళ్ళతో కూడిన బంగారు ఆభరణాలలో బంగారం తక్కువ ఉండి, మేకప్ (తయారుచేసే) ఛార్జీలు ఎక్కువ. పైగా అలాంటి వాటిని తిరిగి అమ్మితే చాలా తక్కువ ధర వస్తుంది. కాబట్టి మీకు వీలైతే కేవలం సింగిల్ ఐటమ్‌లు (గాజులు, గొలుసులు) లాంటి వాటిని తీసుకోవడం మంచిది. వాటికి లేబర్ ఛార్జీలు తక్కువగా ఉంటాయి.

కొన్ని షాపులు మనం కొన్ని బంగారం నగలను ఎప్పుడైనా తీసుకొని 90 నుండి వంద శాతం డబ్బు వాపసు చేస్తామని గ్యారంటీ ఇస్తారు. అలాంటి షాపుల్లో మీరు కొనుగోలు చేయడం ఉత్తమం. ఎందుకంటే కాలానుగుణంగా ఆ నగలను చెడగొట్టి కొత్తవి చేయించాలంటే మీకు అలాంటి షాపుల్లోనే వాపసు చేసి, కొత్తవి కొనుక్కోగలరు.

## దుస్తులు

1. వీలైతే ఇస్త్రీ అవసరం లేని బట్టలు కొనడం మంచిది.
2. బట్టలు గుండీలు, చిన్న చినుగులు మొదలైన వాటిని మనం చేత్తో కుట్టుకోవడం ఉత్తమం.
3. డ్రైక్లీనింగ్ అవసరమైన బట్టలను కొనడం డబ్బు వృధా.
4. వేడినీళ్ళలో, చన్నీళ్ళలో ఒకే విధంగా పనిచేసే డిటర్జెంట్ పౌడర్‌ని కొనడం ఉత్తమం.
5. కొంతమందికి తమ లుంగీలు, నైట్ డ్రస్సులు, నైటీలు రోజూ ఉతకడానికి వేస్తారు. ప్రతిరోజూ ఉతకడానికి వేస్తే బోలెడు డిటర్జెంట్ సబ్బు, శ్రమ వృధాయే  కాకుండా అవి త్వరగా చినిగిపోవడానికి అవకాశం ఉంటుంది. అంటే వాటి జీవిత పరిమాణం తక్కువగా ఉంటుందన్నమాట. అందువల్ల అలాంటి వాటిని రెండు మూడు రోజులు వేసుకున్నా (అదీ ఇంట్లోనే, రాత్రి సమయంలోనే కాబట్టి) బాగానే ఉంటాయి.
6. సింథటిక్ చీరలులాంటి వాటిని ఉతికాక, హ్యాంగర్‌లను ఉపయోగించి ఆరేస్తే ఇస్త్రీ అవసరం ఉండదు సుమా!





# పెట్టుబడులు, తదితరాలు

- మీ పెట్టుబడులన్నింటిని ఎప్పుడూ ఒకే దానిమీద పెట్టకండి. మొత్తం డబ్బంతా స్టాక్‌మార్కెట్ మీదో లేదా బంగారం మీదో ఉంచకండి. అందువల్ల ఆటుపోటులు సంభవిస్తే నష్టాలు వచ్చే అవకావం ఉంటుంది. మీ పెట్టుబడిని స్థలాలు, బంగారం, స్టాకు మార్కెట్, ఇన్సూరెన్స్, సేవింగ్స్ బాండ్ లాంటి వాటిలో ఓ పద్ధతి ప్రకారం ఉంచండి.
- అలాగే ఎక్కువ డబ్బుని బ్యాంకు ఖాతాల్లో ఉంచకండి. అది ఎక్కువ ప్రతిఫలాలను ఇవ్వదు.
- 'ఈనాడు' వారు నిర్వహించే ఇన్వెస్ట్‌మెంట్, స్టాక్‌మార్కెట్ సదస్సులకు హాజరుకండి. వారు నిపుణుల సహాయంతో చక్కటి సలహాలు ఇస్తారు.
- మీ ఇన్వెస్ట్‌మెంట్‌కు మీరే సలహాదారులుగా ఉండండి. ఇతరుల సలహాలు గుడ్డిగా నమ్మకండి.
- స్టాక్‌మార్కెట్‌లో డబ్బు వుంచాలనుకుంటే మీరు కొన్న షేర్ల మీద ఎక్కువ డివిడెండ్‌ని ఇచ్చే వాటిని కొనే విషయం పరిశీలించండి.
- ప్రైమరీ మార్కెట్‌లో చక్కటి కంపెనీలకు ఇన్వెస్ట్ చేయండి. అవి మార్కెట్‌లో అధిక ధరలకు ట్రేడ్ అవుతాయి.
- మార్కెట్ మంచి వూపు మీద ఉన్నప్పుడు మీ షేర్లు అమ్మేయ్యండి. మార్కెట్ నీరసంగా, బలహీనంగా వున్నపుడు తక్కువ ధరలకు దొరికే చక్కటి కంపెనీల షేర్లు కొనండి.
- మ్యూచువల్ ఫండ్‌లు సురక్షితం అని ఎక్కువగా వాటిలో ఇన్వెస్ట్ చేయకండి. గుర్తుంచుకోండి. ఈ ప్రపంచంలో అన్ని ఈక్విటీ మ్యూచువల్‌ఫండ్‌లూ ఎంతో కొంత రిస్క్‌తో కూడుకున్నవే.
- సినిమాలకు పెట్టుబడి పెట్టడం, అధిక వడ్డీలకు డబ్బులు ఇవ్వడం, పేకాట, గుర్రపు పందాలు ఇవన్నీ జూదలక్షణాలు. వీటిలో ఎక్కువ మందికి డబ్బు పోవడమే కాని వచ్చే అవకాశం ఉండదని గుర్తుంచుకోండి.



# ఆర్థిక వ్యవహారాలు

1. మీ జేబులో ఎప్పుడూ వేలు, వేలు డబ్బు ఉంచుకోకండి. దానివల్ల అవసరం ఉన్నా, లేకపోయినా ఖర్చు పెట్టాలనిపిస్తుంది. మిగులు డబ్బుని బ్యాంకులో వేస్తుండడం వల్ల మీరు త్వరగా ఖర్చు పెట్టే అవకాశాలు తక్కువ.
2. ఎప్పుడూ డబ్బుని మనీ సర్క్యులేటింగ్ స్కీమ్‌లలో ఉంచకండి. అలాంటి స్కీమ్‌లలో ఎక్కువ భాగం స్థాపించిన వారికి లేదా మొదట్లో చేరిన వారికే చెందుతాయి. కష్టపడకుండా డబ్బు సంపాదించాలనేది అత్యాశ. ఉన్నది కూడా పోతుంది. నేడు ఇంటర్నెట్‌లో వెలువడే చాలా స్కీమ్‌లు అలాంటివే. ఇంతమందిని చేర్పిస్తే మీకు ఇంత వస్తుంది అని ఆశపెడతారు. మీరు కష్టించి చెమటోడ్చి సంపాదించిన డబ్బుని అలాంటి స్కీమ్‌లో ఉంచకండి. మీ రక్తాన్ని ధారపోసి సంపాదించిన డబ్బుని ఏసి రూమ్‌లో కూర్చొని అలాంటి స్కీమ్‌లు నడిపించేవారికి ధారాదత్తం చేయకండి.

## అప్పులు, క్రెడిట్ కార్డులు వగైరా

1. మీకు కావాల్సిన డబ్బు కంటే ఎక్కువ డబ్బుని ఎప్పుడూ అప్పు తీసుకోకండి. అప్పు డబ్బు ఉచితం కాదని, దాని మీద అప్పుతో పాటు వడ్డీ కూడా పడుతుందని తెలుసుకోకండి.
2. బయట హ్యాండ్ లోన్స్, పాన్‌బ్రోకర్ల దగ్గర కంటే బ్యాంకుల వడ్డీ రేట్లు తక్కువ. కాబట్టి వీలైనంతవరకూ బ్యాంకుల్లోనే డబ్బుని అప్పుగా తీసుకోండి.
3. కొన్ని బ్యాంకులు వడ్డీ రేటు తక్కువ చూపించి అప్లికేషన్ ఫీజు, ప్రాసెసింగ్ ఫీజు అంటూ వడ్డిస్తారు. కాబట్టి బ్యాంకుల్లోంచి డబ్బు తీసుకునే ముందు అటువంటి వాటిని పరిగణనలోకి తీసుకొని మరీ ఓ నిర్ణయానికి రండి.
4. ఒక క్రెడిట్ కార్డు కంటే ఎక్కువ తీసుకోకండి. అందువల్ల ఎక్కువ ఖర్చు పెట్టాలన్న తపన ఉండదు. పైగా క్రెడిట్ కార్డులు పోయే అవకాశం తక్కువ. అంతేకాక వాటి మీద వడ్డీలు ఆకాశాన అంటుతున్నాయి కూడా!

---

**డిస్కౌంట్ షాపులు, పండుగ బోనస్‌లు మిమ్మల్ని ఆకర్షింపచేసి మీచేత కొనిపిస్తాయి. జాగ్రత్త! అలాంటి ప్రకటనలు, షాపులు రాగానే మీ దృష్టిని వాటి మీద నుండి తొలగించండి.**



# పెళ్ళి

మీ అమ్మాయి పెళ్ళి బాగా గ్రాండ్‌గా చేయాలనుకుంటారు. దాదాపు రెండు లక్షలు ఖర్చుపెట్టి పెళ్ళి చేయాలని మీకు ఉంటుంది. దానికంటే పెళ్ళి మామూలుగా చేసి, మిగిలిన డబ్బుని మీ అమ్మాయి పేర బ్యాంకులోనో లేదా మీ అమ్మాయి కాపురానికి కావాల్సిన సామానులు కొనిస్తే అవి వారికి భావి జీవితంలో ఉపయోగపడ్తాయి. మీరే ఆలోచించండి. పెళ్ళి పేరుతో దుబారాని అరికట్టి వాటిని భావి జీవితంలో ఎలా ఉపయోగపడేటట్లు చేయవచ్చో! లేదా మీ అమ్మాయి/ అల్లుడి కోసం ఓ కంప్యూటర్ కొని ఉంచితే దాని సహాయంతో వారు తమ భవిష్యత్‌ని మరింత ఉన్నతంగా తీర్చిదిద్దుకోగలరు కదా!

## దోమలను పారద్రోలటం

ఇవాళా, రేపూ నగరాలలో దోమల బెడద ఎక్కువగా ఉంటోంది. వాటిని పారద్రోలటానికి ఉపయోగించే మస్కిటో రిఫెల్లర్ ధరలు ఆకాశాన్నంటుతున్నాయి. రోజుకి కనీసం రూపాయిన్నర నుండి రెండ్రూపాయల దాకా ఖర్చు అవుతుంది. ఈ నేపథ్యంలో చవకైన పద్ధతులను మనం అన్వేషించాల్సి ఉంది. అవేమిటో ఇక్కడ చూద్దాం.

- దోమలు రాకుండా ఇంట్లో చెత్తాచెదారం లేకుండా జాగ్రత్త పడండి.
- ఇంకో పద్ధతి ఏమిటంటే – ఆవనూనె (మస్టర్డ్ ఆయిల్)ని చేతులకు, కాళ్ళకు రాసుకోవడం వల్ల దోమలు దరిచేరవు. అలాంటి ఆవనూనె కేవలం లీటర్ నలభై ఐదు మాత్రమే. పైగా అవి మన ఎముకలను గట్టిపరుస్తుంది కూడా!



# మరికొన్ని ఆదా మార్గాలు

- షాపింగ్ లేదా బేకరీలకు వెళ్ళే ముందు ఇంట్లో ఏదో ఒకటి తిని బయలుదేరండి. అందువల్ల బేకరీల్లో, హొటళ్ళలో తినడానికి వెంటనే మనసు లాగకపోవచ్చు. హొటళ్ళు, బేకరీల తిండి చాలా ఖరీదన్న విషయం మీకు తెలిసిందే కదా! పైగా అవి
- ప్రయాణాల్లో ఎక్కడికైనా వెళ్లేటప్పుడు మీ స్వంత టిఫిన్‌లు వెంట బెట్టుకు వెళ్ళండి. పులిహొర, పెరుగన్నం ఎక్కువకాలం నిలవ ఉంటాయి. అలాగే జొన్నరొట్టెలు కూడా. వీటివల్ల హొటల్లో తిని డబ్బు ఖర్చు చేసుకునే అవకాశం తక్కువ. పైగా ఆరోగ్యం సైతం చెడిపోదు.
- నీళ్ళని పొదుపుగా వాడండి. అవసరం లేనప్పుడు లీకేజి లేకుండా పంపులను గట్టిగా కట్టెయ్యండి.
- మీ ఇంట్లో పరికరాల రిపేర్లని మీరే స్వయంగా చేసుకోవడం నేర్చుకోండి. టీవీ, రేడియో, ట్రాన్సిస్టర్, కంప్యూటర్, వాషింగ్ మెషీన్ లాంటి పరికరాలు చెడిపోతే బయట మెకానిక్‌ని పిలిపించే బదులు వాటిని మీరే రిపేరు చేసుకుంటే బోలెడు డబ్బు ఆదా అవుతుంది.
- మీ తలకు వాడే షాంపూలు మొదలైన వాటిని మీరే తయారుచేసుకోండి. ఉదాహరణకు ఎన్నో షాంపూలు కంటే కుంకుడుకాయ రసం ఉత్తమం.
- ఈ ప్రపంచంలో దేనినైనా బేరమాడవచ్చని తెలుసుకోండి. బేరమాడడం మీ స్టేటస్‌కి భంగం అని ఆలోచించకండి. మీరు బేరమాడకపోతే లాభం రూపేణా వ్యాపారస్తులు ఇంకా డబ్బు చేసుకుంటారు.
- బట్టలు, కాస్మొటిక్స్, తినుబండారాలు ఒకే షాప్‌లో కొనే బదులు అనేక షాపులు తిరిగి కొంటే మీకు ధరలో తగ్గింపుకు దొరకవచ్చు.
- వీలైనంతవరకు మీ చెక్కులు బౌన్స్ కాకుండా చూసుకోండి. ఎందుకంటే బౌన్స్ అయిన చెక్కులకు బ్యాంకువారు జరిమానా వేస్తారు. పైగా మరో అదనపుచెక్కుని మీరే ఇవ్వాల్సి ఉంటుంది. ప్రతి చెక్కు కూడా ఖరీదైనదే కదా!

---

**ఒకసారి వాడి పారేసే రేజర్లు, పేపర్ కప్పులు లాంటి వాటిని నివారించండి. అలాంటివి చాలా డబ్బుని తినేస్తాయి.**



# చందాదారులను వదిలించుకోవడం

వినాయకచవితి, దసరా పండుగల సందర్భంలో చాలామంది చందాదారుల మంటూ ఇంటికి వస్తారు. అలాంటి వారిని వదిలించుకోవడానికో చిట్కా ఉంది. మీ శ్రీవారు ఉన్నప్పుడు వస్తే 'మేడమ్ లేదు! ఆమె వచ్చాక రండి' అని పంపండి. అలాగే మీ శ్రీమతి ఉంటే 'సార్ లేరు! ఆయన వచ్చాక రండి' అంటూ పండుగ వచ్చేదాకా తప్పించుకోండి. ఒకసారి పండుగ సమీపించాక వారే రావడం మానేస్తారు.

అలాగే సేల్స్ గరల్, సేల్సుమాన్ ఇంటికి వస్తే 'ఇంట్లో ఆడవారు లేరు. వాళ్ళు ఉన్నప్పుడు కొంటాం' అనో, మీ శ్రీమతి ఉన్నప్పుడు "మగవారు లేరు, డబ్బు లేదు'' అనో తప్పించుకోండి. కొంతమంది సేల్సువారు గట్టిగా పట్టుకుంటారు. అలాంటి వారిని వదిలించుకోవడానికి ఈ చిట్కా తప్ప వేరే ఉపాయం లేదు.

## దుస్తులు

కొన్ని కంపెనీలు, ఫ్యాక్టరీ సెకండ్ సేల్స్' పేరిట చాలా తక్కువ ధరకు అందజేస్తారు. మీరు వస్త్రాలు కొనేటప్పుడు అవి కొనడం వల్ల డబ్బు ఆదా అవుతుంది.

## బ్యూటీక్లినిక్‌లు

నిజానికి బ్యూటీక్లినిక్‌లలో చేసే చాలా టెక్నిక్‌లు మనం ఇంటి దగ్గరే చేసుకోవచ్చు. ఫేషియల్, మసాజ్ లాంటివి కుటుంబ సభ్యుల సహాయంతో మీరేచేసుకుంటూ బోలెడు డబ్బు ఆదా అవుతుంది.

---

**డబ్బుని పొందడం, కొండని తవ్వడం అంత కష్టం. దానిని ఖర్చు పెట్టడం ఇసుకలో నీళ్ళు ప్రవహించడమంత తేలిక.**




# దురలవాట్లు

మీకు కనుక బార్, రెస్టారెంట్లలో డ్రింక్ తీసుకోవడం అలవాటు ఉంటే ఒక బాటిల్ తీసుకొని ఇంట్లోనే త్రాగడం మంచిది. ఎందుకంటే బార్‌లో బయట అమ్మే ధర మీద ఖచ్చితంగా 25 శాతం ఎక్కువ వెల ఉంటుంది.

మీకు పేకాట, గుర్రపు పందాలు, లాటరీ, జూదం, స్టాక్ ఎక్స్ఛేంజ్‌ల్లో స్పెక్యులేషన్ లాంటి అలవాట్లు ఉంటే వెంటనే మానెయ్యండి. ఎందుకంటే అలాంటివి మీకు వినోదాన్ని ఇస్తుండవచ్చు. కాని డబ్బు పోతుంది పొరబాటున ఒకోసారి కొద్దిగా వచ్చినా తుదకు మీ ఆస్థి కర్పూర హారతి అవుతుంది. అలాంటి పాడు అలవాట్ల కంటే టీవీ చూడడం, కుటుంబ సభ్యులతో గడపడం అన్ని విధాలా మేలు. ఒకవేళ జూదం ఆడటం తప్పనిసరి అయినపుడు 'ఇంత డబ్బు వరకు మాత్రమే' అని ఓ నిర్ణీతంగా నిశ్చయించుకోండి. ఆ డబ్బు పోగానే అంతకు మించి ఒక్కపైసా కూడా జూదమాడకుండా అక్కడ్నుంచి లేచి వెళ్ళిపోండి.

చాలామంది దురలవాట్లు అంటే కేవలం పేకాట, తాగుడు, సిగరెట్లే అనుకుంటారు. కాని కొంతమంది విపరీతంగా బట్టలు కొనేస్తారు. అవసరమున్నా లేకపోయినా అలాగే కొంతమంది అతిగా తింటారు. ఆకలేసినా, లేకపోయినా అంతే! ఇంకొంతమంది టీవీ, సినిమాలు ఎక్కువగా చూస్తారు. నిజానికి ఇవన్నీ ఒక రకమైన దురలవాట్లే! వాటివల్ల డబ్బు నాశనం అవడం తప్ప వేరే ఉపయోగం లేదు. కాబట్టి 'ఇలాంటి దురలవాట్లని సైతం మానెయ్యడం వల్ల మీకు డబ్బు ఆదా అవుతుంది.

## అప్పులు (బాకీలు) తీర్చడం

1. ముందుగా అత్యవసర పరిస్థితుల నిమిత్తం ఆరు నెలల ఆదాయాన్ని బ్యాంక్‌లో ఎప్పుడూ ఉంచుకోండి. సేవింగ్స్‌ని ఒక ఛాలెంజ్‌గా తీసుకోండి.
2. మీ ఇంటి అద్దె ఎట్టి పరిస్థితుల్లోనూ మీ స్థూల ఆదాయంలో నాల్గవ వంతు మించరాదు
3. క్రెడిట్ కార్డులు మీద బాకీని వెంటనే చెల్లించండి. లేకపోతే వడ్డీ మీద వడ్డీలు కట్టాల్సి ఉంటుంది. ఎప్పటికైనా కట్టాల్సిందే కాబట్టి త్వరగా కట్టేస్తే వడ్డీ ఆదా అవుతుంది.



# ఎలక్ట్రిసిటీ బిల్లులను తగ్గించుకోవడం

ప్రస్తుతం రాష్ట్ర ప్రభుత్వం విద్యుచ్ఛక్తి బిల్లులను పెంచిన నేపథ్యంలో ఇళ్ళల్లో, ఆఫీసుల్లో విద్యుచ్ఛక్తి ఉపయోగాన్ని వీలైనంత తక్కువకు తగ్గించుకోవడం ఉత్తమం. ఈ నేపథ్యంలో ఏమేమి చర్యలు తీసుకోవాలో చూద్దాం.

- మీరు ఉండనపుడు లైట్లన్నీ తీసెయ్యండి. అలాగే ఎక్కడికైనా బయటకు వెళ్తున్నపుడు ఫ్యానులు, స్విచ్‌లున్నీ ఆఫ్‌లోనే ఉన్నాయని నిర్ధారించుకుని మరీ వెళ్ళండి. అదే దూరపు ఊళ్ళకు వెళ్తున్నపుడు, ఫ్రిజ్ సైతం ఎలక్ట్రిక్ ప్లగ్‌ని తొలగించి మరీ వెళ్లండి.
- రాత్రిపూట ఎక్కువసేపు మేల్కొనకండి. కరెంటు ఖర్చు బాగా ఆదా అవుతుంది.
- మీ రిఫ్రిజిరేటర్‌ని వంటగదిలో చల్లటి స్థానంలో ఉంచండి. అందువల్ల విద్యుచ్ఛక్తి కోసం ఎక్కువ ఉపయోగించాల్సిన అవసరం లేదు.
- ప్రతీసారి మీ ఫ్రిజ్‌ని ఓపెన్‌చేసే ముందు ఏమి తీయాలో ముందే నిర్ణయించండి. అంతే కాని ఫ్రిజ్ డోర్ తీసి ఏమేమి తీయాలా అని ఎక్కువసేపు ఆలోచించకండి. కరెంట్ వృథా అవుతుంది.
- షాండ్లియర్స్ ఎక్కువ విద్యుచ్ఛక్తిని లాగుతాయి. కాబట్టి ప్రత్యేక సందర్భాల్లో తప్ప మామూలుగా షాండ్లియర్ లైట్లని వేయకండి.
- కంప్యూటర్స్‌ని కాసేపు వదిలి వెళ్లాల్సి వచ్చనపుడు, అలాగే ఉంచి వెళ్ళండి. ఆఫ్‌చేసి మళ్ళీ స్టార్ట్ చేయాలన్నీ ఎక్కువ శక్తి వినియోగమవుతుంది.
- ఇస్త్రీ అవసరంలేని బట్టలను కొనుక్కోవడానికి ప్రయత్నించండి.
- మామూలుగా లోకల్ ఫ్యాన్‌లకు, పేరున్న బ్రాండ్ కంపెనీలకు తేడా బేరింగ్ బాల్‌లోని రాగి. అందువల్ల పేరున్న బ్రాండ్‌గల ఫ్యానులను (ఉదాహరణకు ఓరియంట్, ఖైతాన్ లాంటి కంపెనీలు) వాడితే విద్యుచ్ఛక్తి ఆదా అవుతుంది.
- మీ సీలింగ్ ఫ్యాను మూడు నెంబర్‌లోపు స్పీడు తిరుగుతుంటే తక్కువ విద్యుచ్ఛక్తి, మూడు నెంబర్‌పైన అయితే ఎక్కువ విద్యుచ్ఛక్తిని ఖర్చు చేస్తాయి.



# ఎలక్ట్రిసిటీ బిల్లులను తగ్గించుకోవడం

- రిమెట్ కంట్రోల్‌తో టీవీ ఆన్ చేసినపుడు మీకు కావాల్సి ఛానళ్ళని వరుసగా వచ్చేటట్లు ఉంచుకోండి. (ఉదాహరణకు జెమినీ, ఈటీవి, సిటీ కేబుల్, మా టీవీ, దూరదర్శన్‌లకు 1,2,3,4,5 నెంబర్లు వరసగా ఇస్తే బాగుంటుంది) లేకపోతే ప్రతి ఛానల్ నొక్కుతూ పోతే కొన్నాళ్ళకు పిక్చర్ ట్యూబ్ చెడిపోతుంది.
- మీ ఇంటి గోడలకు నీలం, పచ్చ రంగులు వేయడం వల్ల వెలుతురు బాగా కన్పిస్తుంది. అందువల్ల ఎక్కువ లైట్లు అవసరం వుండదు. అదే గోడకు ఇతర రంగులు వేస్తే ఎక్కువ లైటింగ్ అవసరం ఉంటుంది.
- విద్యుత్‌ని ఆదా చేసే పలురకాల బల్బులు, ట్యూబులు (వీటినే చైనా బల్బులు అని కూడా అంటారు) మార్కెట్‌లో కొంత కాలంగా లభ్యమవుతున్నాయి. అవి కొంత ఖరీదుతో కూడుకున్నప్పటికీ దీర్ఘకాల వినియోగంలో విద్యుత్ ఆదా చేసి మన విద్యుత్ ఛార్జీలను గణనీయంగా తగ్గిస్తాయి.
- ఎక్కువగా ఉపయోగించని గదుల్లో తక్కువ వోల్టులు గల లైట్లు/ బల్బులను వాడండి.
- వీలైనంతవరకు ఎయిర్ కండిషన్‌ని నివారించండి. అది ఖరీదే కాక దానివల్ల కొంత మందికి ఎలర్జీ, దగ్గులు, తుమ్ములు వచ్చే అవకాశం కూడా ఉంది.
- రూమ్‌లో చిన్న బల్బులు అనేకం వెలిగించే బదులు ఒకే పెద్ద లైటు ఉపయోగిస్తే విద్యుచ్ఛక్తి ఆదా అవుతుంది.
- ఇంట్లో వారందరికీ చెప్పండి 'గది వదిలేటప్పుడు లైట్లు తీసెయ్యి' మని.
- అవసరమైనపుడే బయట వరండాలో, పోర్టికోలో లైట్లు వేయండి. అవసరం లేనపుడు ఆఫ్ చేసి ఉంచండి.





# ఆరోగ్యం

ముందుగా మీరు ఎప్పుడూ ఆరోగ్యంగానే ఉండండి. అదేమిటి అని విస్తుపోతున్నారా? అంటే ఫిట్‌గా ఉండండి అని అర్థం. యోగా, ప్రాణాయామం, వాకింగ్‌లతో పాటు చక్కటి ఆహారం తీసుకుంటే డాక్టర్ల వెంట, డయాగ్నస్టిక్ సెంటర్ల వెంట తిరగాల్సిన అవసరం ఉండదు.

- మీ పిల్లలకు ఇవ్వాల్సిన టీకాలు, వాక్సిన్‌లను వెంటనే వేయించండి. లేకపోతే పెద్ద సమస్యలు వచ్చే అవకాశం ఉంది. ఇవాళ, రేపు ఈ టీకాలు ప్రభుత్వమే ఉచితంగా చేయిస్తుంది కూడా!
- ఓ మంచి హెల్త్ ఇన్సూరెన్స్ పాలసీని తీసుకోండి. ఏదో డబ్బులు అవుతున్నాయని పాలసీ తీసుకోవడం మానెయ్యవద్దు. ఒకేసారి సమస్య వస్తే కష్టం.
- లక్షలు, వేలు ఖర్చు పెట్టి బరువు తగ్గే కోర్సులో జాయిన్ కాకండి. దాని బదులు తిండి తగ్గించి, వాకింగ్, యోగా చేస్తే ఫలితాలు బాగుంటాయి. మరో అద్భుత ఐడియా ఏమిటంటే – వారానికొకసారి ఉపవాసం ఉండండి. అయితే ఇతరత్రా వేరే రోగాలు (డయాబెటిస్ లాంటివి) లేనివారు ఉపవాసం ఉండాలి. మిగతావారు డాక్టర్ల పర్యవేక్షణంలో ఉపవాసం ఉండే అవకాశాన్ని పరిశీలించవచ్చు.
- డాక్టర్ దగ్గరకు వెళ్ళినప్పుడు మీ పాత రిపోర్టులు సైతం తీసుకెళ్ళాలి. లేకపోతే ఆయన సమస్యని ఇంకో కోణంలో చూసే అవకాశం ఉంటుంది. అందువల్ల జబ్బు తగ్గకపోయే అవకాశం ఉంటుంది.
- అలాగే హాస్పిటల్‌లో జాయిన్ అవ్వాల్సి వచ్చినపుడు మీ వస్తువులు (టూత్‌పేస్టు, సబ్బులు) మీరే మర్చిపోకుండా తీసుకెళ్ళండి. లేకపతోఏ హాస్పిటల్ ప్రక్కనున్న షాపులో బోలెడు డబ్బు పెట్టి వాటిని కొనాల్సి ఉంటుంది.
- సంవత్సరానికొకసారి ప్రకృతి వైద్య శిబిరానికో, సిద్ధ సమాధి యోగ లేక ఇతర యోగ గురువుల శిబిరాలకో వెళ్ళండి. దానివల్ల దీర్ఘరోగాలు వచ్చే అవకాశం ఉండదు.



# ఆరోగ్యం

- ఏదైనా ఆరోగ్య సమస్య ఎక్కువ కాలం తగ్గకుండా వేధిస్తూ ఉంటే వెంటనే డాక్టర్‌ని కలవండి. లేకపోతే ఆ రోగం క్రానిక్ అయి ఎంతకూ తగ్గకపోయే అవకాశం ఉంటుంది.
- ముందుగా వీలైనంతవరకు ప్రత్యామ్నాయ వైద్యవిధానాల పట్ల ఎక్కువ ఆసక్తి చూపండి. ఉదాహరణకు హోమియో, ఆయుర్వేదం, యోగా, నాచురోపతీ, వాటర్ థెరపి, ఆక్యుపంక్చర్ లాంటి విధానాలు అనుసరిస్తే ఖర్చు తక్కువే కాకుండా ఇతరత్రా వచ్చే సైడ్ ఎఫెక్ట్‌లు ఉండవు. అయితే అత్యవసర విషయాల్లో మటుకు అల్లోపతి వైద్యవిధానం తప్పనిసరి సుమా!

1. త్రాగుడు, ధూమపానం, వ్యభిచారం లాంటి చెడ్డ అలవాట్లు మీ ఆరోగ్యాన్ని హరింపచేసి డబ్బుని నాశనం చేస్తాయి కాబట్టి వాటిని మానండి.
2. తరచుగా మీ ఆరోగ్యాన్ని డాక్టర్ చేత చెకప్ చేసుకుంటూ ఉండాలి. అందువల్ల పెద్ద రోగాలను ముందుగానే కనిపెట్టవచ్చు. మొక్కై వంగనిది మానై వంగుతుందా అన్నట్లుగా ముందుగానే చిన్న సమస్యలప్పుడే కనిపెట్టి చికిత్సని పొందితే అన్ని విధాల ఉత్తమం. అలాగే మీ పిల్లలకు అవసరమైన వాక్సినేషన్ చేయించండి.
3. మంచి ఆరోగ్య లక్షణాలను అభివృద్ధి చేసుకోండి. యోగా, ప్రాణాయామం, ధాన్యం లాంటి అలవాట్లు శరీరాన్ని ఎప్పుడూ డాక్టర్ చుట్టూ తిరగనివ్వకుండా కాపాడుతాయి.
4. అలాగే వివిధ హాస్పిటల్ వారు ఇచ్చే రకరకాల ఆరోగ్య స్కీమ్‌లను పరీక్షించండి. ఉత్తమం అన్పించిన దానిని ఎన్నుకోండి.
5. మందులు కొనేటప్పుడు వీలైనంతవరకు ప్రామాణిక మెడికల్ షాపుల్లో (అపోలో మెడికల్ షాపులు) కొనడానికి ప్రయత్నించండి. అందువల్ల నకిలి మందులను అరికట్టవచ్చు.
6. పదే పదే మెడికల్ టెస్టులు చేయించవద్దు. అలాగే పదే పదే డాక్టర్లని మార్చకండి. కొత్త డాక్టర్ దగ్గరకు వెళ్ళినప్పుడు పాత రిపోర్టులు తీసుకెళ్తే మీకు మళ్ళీ టెస్టులు చేయించాల్సిన అవసరం ఉండదు.



# ఆరోగ్యం

7. షాపుల్లో మందులు కొనేటప్పుడు లోకల్ ట్యాక్స్ ఎక్స్ట్రా అని ఉంటుంది. చాలామంది షాపువారు ఈ విషయంలో ఎక్కువ బిల్లు వేస్తుంటారు. కాబట్టి లోకల్ ట్యాక్స్ ఎంతో మీరు ముందే కనుక్కోండి. అందువల్ల బిల్లు తక్కువ అయ్యే అవకాశాలు ఉంటాయి.

8. మీకొచ్చిన సమస్యకి డాక్టర్ – సర్జరీ అవసరమని చెప్తారు. సాధారణంగా ఎక్కువమంది డాక్టర్లు సర్జరీ అవసరం ఉన్నా, లేకపోయినా అవసరమేనని చెప్తారు. అలాంటప్పుడు రెండో డాక్టర్ సలహా తీసుకోండి.

9. జిమ్, హెల్త్‌క్లబ్‌లకు వెళ్ళి అక్కడ చేసేవాటిలో ఎక్కువ భాగం బుల్‌డోజర్‌తో మనం ఇంట్లోనే చేయవచ్చు. స్టీమ్‌బాత్, మసాజ్ ఇంట్లో వారితోనే చేయించుకోవచ్చు. అందువల్ల ఖర్చు తగ్గుతుంది.

## పొదుపుకి ప్రతిరూపం యన్టీయార్



చలనచిత్రంలో అద్భుత నటుడిగా పేరు గాంచిన యన్టీఆర్ ఎన్నో కోట్లు, లక్షలు సంపాదించినా డబ్బును ఎన్నడూ దుబారా చేసేవారు కారు. నేడు ఏమీ లేకున్నా ఆడంబరాలతో కారు మెయిన్‌టెయిన్ చేసే ప్రబుద్ధులు ఆయన జీవితం నుండి చాలా నేర్చుకోవాలి. సెట్‌లో ఒక చిన్న గుండుసూది కన్పించినా చేతిలోకి తీసుకొని జాగ్రత్త చేసేవారు ఆయన. అది ఎప్పటికయినా పనికొస్తుందని ఆయన భావన. జీవితంలో ప్రతి కోణంలోనూ డబ్బు ఆదా ఎలా చేయాలో ఆయన జీవితం నుండి నేర్చుకోవాలి. అంత జాగ్రత్తగా ఉన్నారు కాబట్టే ఆయనకు పదకొండుమంది సంతానం అయినా అందరికి చక్కటి ఆస్తిపాస్తులు మిగల్చగలిగారు.

---

**నెలకొకసారి మీ ఖర్చులను సమీక్షించండి. ఏ ఖర్చు అధికంగా వుంటుందో మీకు తెలిసిపోతుంది. దానిని అదుపులో ఉంచుకోవచ్చు.**



# ఆఫీసులో ఖర్చులు తగ్గించుకొనే పద్ధతులు

కేవలం మీ గృహంలోనే కాదు, మీ వ్యాపారంలో, ఆఫీసులో సైతం మీరు ఖర్చులు తగ్గించుకొని డబ్బుని ఆదా చేయవచ్చు.

- మీ ఆఫీసుకు రకరకాల వ్యక్తులు వస్తారు. వారందరికి మీరు టీ, కాఫీ, కూల్‌డ్రింక్స్ తెప్పించాల్సి ఉంటుంది. మాటిమాటికీ వాటిని బయటి నుండి తెప్పించాలంటే మీకు బోలెడు డబ్బు ఖర్చు అవుతుంది. అదే మీరు ఆఫీసులో ఓ మూల స్టౌ ఉంచి, కాఫీ, పౌడర్, పాలు తెప్పించి ఉంచి అటెండర్‌తో పని చేయించుకోగలిగితే మీకు ఒక్కో గ్లాసు కాఫీ, టీలకు రూపాయి కూడా పడదు. అలాగే బయట కూల్‌డ్రింక్స్ పదేసి రూపాయలు పెట్టి కొనే బదులు మీరే రస్నా లాంటి వాటితో కూల్‌డ్రింక్‌ని బట్లర్ సోడాతో తయారుచేయించగలిగితే మీకు గ్లాసుకు మూడు, నాలుగు రూపాయలు కూడా ఖర్చు పడదు.
- నిజానికీ ఆఫీసులో మీ డబ్బు ఎక్కడెక్కడ వృథా అవుతుందో తెలియాలంటే మీ భార్యనో, తల్లిగారినో వ్యాపారంలోకి తీసుకురండి. మనకంటే ఆడవారికి బాగా తెలుస్తాయి వృథా ఖర్చులు. పైగా వారిని మించిన నమ్మకస్తులు మనకు దొరకరు. అలా మహిళలను బిజినెస్‌లోకి తీసుకోవడం వల్ల ఖర్చుల దుబారాని అరికట్టడమే కాకుండా, మనం వ్యాపారరీత్యా వేరే వూరికి వెళ్ళినప్పుడు మన బిజినెస్‌ను వారు సమర్ధవంతంగా చూసుకోగలుగుతారు. బయట పదివేలు ఇచ్చి ఓ మేనేజర్‌ని పెట్టుకునే బదులు మన ఇంట్లో వారినే చూసుకోమంటే మనకు తోడుగా ఉంటారు.
- డబ్బుని ఆదా చేసే మరో అద్భుత ప్రక్రియ కంప్యూటర్. మీ ఆఫీసులో గది నిండా వున్న ఫైళ్ళని కంప్యూటరీకరణ చేస్తే మీకు బోలెడు స్థలం, డబ్బు, శ్రమ ఆదా అవుతాయి. కంప్యూటర్లని ఒకసారి కొంటే చాలు. మళ్ళీ, మళ్ళీ వాటికై పెట్టుబడి పెట్టాల్సిన అవసరం లేదు. అందువల్ల బోలెడు స్థలం ఆదా అవుతుంది. కావాల్సినప్పుడల్లా మార్పులు, చేర్పులు తేలికగా చేసుకోవచ్చు. మాటి మాటికీ అక్కౌంట్స్ పుస్తకాలు, పేపర్లు, పెన్నులు లాంటి స్టేషనరీ మీద ఎక్కువ ఖర్చు పెట్టాల్సిన అవసరం లేదు.

---

**కూల్‌డ్రింక్‌ల మీద పెట్టే డబ్బుని నిమ్మకాయ రసం మీద పెడితే బోలెడు డబ్బు ఆదాతో పాటు ఆరోగ్యం కూడా దివ్యంగా ఉంటుంది.**



# ఆఫీసులో ఖర్చులు తగ్గించుకొనే పద్ధతులు

- అలాగే ఇంటర్నెట్ కనెక్షన్‌ని కూడా తీసుకుంటే మీకు బోలెడు సదుపాయాలు ఉంటాయి. ఎక్కడికైనా ఇ-మెయిల్‌ని వెంటనే ఎటువంటి స్టాంపులతో పనిలేకుండా అప్పటికప్పుడు పంపవచ్చు. అలా ఎలక్ట్రానిక్ మీడియా ద్వారా మీరు అత్యంత ప్రయోజనాన్ని పొందగలరు. కంప్యూటర్, ఇంటర్నెట్ గురించి తెలుసుకోవాలంటే తెలుగులో అతి తేలికైన పుస్తకాల కోసం ఇది రచయిత రాసిన 'కంప్యూటర్ శాస్త్రం', 'ఇంటర్నెట్' పుస్తకాలు చదవండి. అన్ని పుస్తకాల షాపుల్లో (ముఖ్యంగా విశాలాంధ్ర పుస్తకశాలలు) దొరుకుతాయి.
- మీ ఆఫీసుకు సంబంధించిన వస్తువులు, స్టేషనరీ, వాహనపు ఇంధనం లాంటి వాటిని వీలైతే మీరే స్వయంగా కొనుగోలు చేయండి. ఎందుకంటే అలాంటి వాటిని మీ ఉద్యోగులకు అప్పజెప్తే, వారు ఆయా షాపు వారితో కుమ్మక్కయి కమీషన్ కొట్టేస్తారు. బిల్లు మీద మామూలుగానే అధిక రేట్లు వేయించి, తక్కువ ధర చెల్లించి మిగతా డబ్బు కాస్తా జేబులో వేసుకుంటారు. అలాగే స్టేషనరీలో కూడా స్టాఫ్ తన స్వంతం క్రింద వస్తువులు వాడుకోకుండా వాటిని భద్రంగా ఒక బీరువా లేదా స్టోర్ రూమ్‌లో ఉంచే ఏర్పాటు చేయండి. ఇక పెట్రోలు బంకుని మీ తరఫున మాట్లాడుకుని మీ వాహనాల్లో పోసేటట్లుగా చూసుకోండి. నెలకాగానే వారి బిల్లు వారికి ఇచ్చే ఏర్పాటు చేయండి. అలాగే మీ వాహనాన్ని మీ ఉద్యోగులు తమ స్వంత పనుల కోసం వాడుకోకుండా నిఘా పెట్టండి.

## సింప్లిసిటికీ నిదర్శనం గాంధీజీ

దక్షిణాఫ్రికాలో బారిస్టర్ డిగ్రీ చదివినప్పటికీ, మహాత్మాగాంధి చాలా నిరాడంబరంగా జీవించారు. ఓ పంచె, కళ్ళజోడు, చేతిలో కర్ర... ఇది ఆయన రూపం. ఆడంబరాలకు వ్యతిరేకంగా స్వజాతి నూలు వస్త్రాలనే వాడాలని ఆయన చాటించారు. మనలో చాలామంది ఏమీ లేకున్నా గొప్పలు చెప్పకునేవారు ఆయన సింప్లిసిటీకి చేతులెత్తి నమస్కరించాలి. ఆయన తల్చుకుంటే బెంజీకారులో, ఫ్లైట్‌లలో తిరిగేవారు. కాని సింప్లిసిటికీ, దుబారాకి వ్యతిరేకి అయిన ఆయన నిరాడంబరత్వంలోనే జీవించారు.



# ఆహార పదార్థాలు

రాబోయే రోజులు కరువు దినాలు. మన రాష్ట్రంలో ఏర్పడిన ఈ కరువు ఎక్కువగా ఉంది. అందువల్ల రాబోయే ఆరు నెలల్లో, బియ్యం, పప్పులు విపరీతంగా పెరిగిపోయే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయి. కాబట్టి మీరు ఇప్పుడు ధరలు తక్కువ ఉన్నప్పుడే వాటిని పెద్ద ఎత్తున కొనుగోలు చేసి, రాబోయే కాలంలో వినియోగం చేసుకుంటే మీకు డబ్బు ఎక్కువగా ఆదా అవుతుంది.

- మీ ఇంట్లోనే మొక్కలు పెంచండి. అందులో అవసరమైన కూరగాయలను పెంచితే డబ్బు ఆదా అవుతుంది.

## పండ్లు

- మీరు పండ్లు కొనాలనుకున్నప్పుడు చిన్న చిన్న ఆపిల్స్, ఆరెంజ్ కాయలు ఎన్నుకోండి. అవి మీ పిల్లల చేతికి సరిపోతాయి. పైగా పెద్ద కాయను మొత్తం పిల్లలు తినలేరు. వృథా చేస్తారు.
- బిగ్‌బజార్, జెయింట్ సూపర్ మార్కెట్‌లు లాంటివి చాలా ఐటమ్‌లను చవకగా ఇస్తాయి. అక్కడ కొనుగోలు చేయడం మంచిది.

### తినాలన్పించిన ఐటమ్‌ని ఇంట్లోనే చేసుకోండి

ఈ ప్రపంచంలో ఏ ఐటమ్‌నయినా ఇంట్లోనే చేసుకోవచ్చు. ఆఖరికి చాక్‌లెట్స్, కేక్స్ సైతం మనమే తయారుచేసుకోవచ్చు. అందువల్ల మార్కెట్‌లో అమ్మే ధరకు మనకు కనీసం నాల్గవ వంతు కూడా పడదు. ఆఖరికి ఒకప్పుడు ఫైవ్‌స్టార్ హోటల్‌లో తయారుచేసే నూడుల్స్, చికెన్ 65, పన్నీర్ లాంటివి సైతం మనం తేలికగా ఇంట్లోనే చేసుకోవచ్చు. వాటివల్ల కేవలం ఖర్చే కాకుండా మనం శుభ్రంగా (హోటల్ వంటాళ్ల మురికి, చెమట చేతులతో కాకుండా) రుచికరంగా చేసుకోవచ్చు. 'అరే! అలాంటి వంటకాలు చేయడం నాకు రాదే!' అని గాభరా పడ్తున్నారా? నో టెన్షన్! మార్కెట్‌లో వంటల మీద బోలెడు పుస్తకాలు ఉన్నాయి. వాటి ద్వారా తయారుచేసుకోవచ్చు.



# ఫుడ్ ఐటమ్స్

- ఉదయం చేసే టిఫిన్‌నే కొద్దిగా ఎక్కువ చేస్తే దానినే సాయంకాలం తినడానికి వీలవుతుంది. అందువల్లే ఒక టిఫిన్‌నే మళ్ళీ మళ్ళీ వండాల్సిన అవసరం ఉండదు.
- ఏ కాలంలో దొరికే కూరగాయలు, పండ్లను ఆ కాలంలోనే కొంటే ఆఫ్ సీజన్‌లో వాటికి అధిక ధర పెట్టి కొనాల్సిన అవసరం లేదు.
- మీరు బాచిలర్ అయి మెస్‌లో భోంచేస్తే మటుకు నెలకు సరిపడా టిక్కట్లు కొనుక్కోవడం మంచిది. అందువల్ల మీ భోజనం రేటు తగ్గుతుంది.
- **ఒకోసారి మీకు ఇంట్లో అన్నం వండకపోవచ్చు. మీకు మూడ్ లేకో అస్వస్థత వల్లో అన్నం, కూరలు వండే ఓపిక లేకపోతే, మీ దగ్గర ఉన్న మెస్‌లో కారియర్ తెప్పించండి. నిజానికి ఒక కారియర్ ఇద్దరు లేక ముగ్గురు మనుషులకు పూర్తిగా సరిపోతుంది. ఉదాహరణకు ప్లేట్ మీల్ రూ.30/- అయితే, కారియర్ మీల్స్ మీకు రూ.60/-కే వస్తుంది. అందువల్ల ముగ్గురు వ్యక్తులు తినడం వల్ల మీకు దాదాపు రూ. 30/- ఆదా (రూ.30×3=90) అవుతుంది.**

ఈ పద్ధతిని ఇద్దరు లేక అంతకంటే ఎక్కువ మంది ఉన్న బాచిలర్స్ సైతం పాటిస్తే డబ్బు ఆదా అవుతుంది. పైగా రకరకాల కూరలు, అప్పడం,

**జొన్నరొట్టెలు తిని డబ్బుతోపాటు ఆరోగ్యాన్ని సైతం సొంతం చేసుకోండి**

జొన్నరొట్టెలు మంచి బలం. మీ దేహాన్ని స్థిరంగా ఉంచుతాయి. దీనికి తోడు అవి త్వరగా అరగవు. దాంతో తిరిగి వెంటనే ఆకలయ్యే అవకాశం తక్కువ. ఇన్ని ప్రయోజనాలున్న జొన్నరొట్టె అలవాటు ఉన్నవారు నెలకు మూడొందలతో ఆహారాన్ని పొందగలరు.

ఒక కిలో జొన్న పిండి వెల రూ. 35/- మాత్రమే. పైగా ఎటువంటి నూనె అవసరం లేదు. కిలోకి దాదాపు ముప్పై జొన్నరొట్టెలు వస్తాయి. దీనిని బట్టి జొన్నరొట్టెలను ఇంట్లో సైతం చేసుకొని తిన్న చవకేనని రుజువవుతుంది.





# టిఫిన్స్

స్వీట్ సైతం కారియర్‌తో పాటు వస్తాయి. ముఖ్యంగా ఇంటికి ఎవరైనా అతిథులు వస్తున్నప్పుడు వంట అర్జంటుగా చేయలేనపుడు ఈ పద్ధతిని అనుసరించడం మంచిది.

- మీరు కుటుంబం మొత్తానికి ఒకేసారి వంట చేయండి. అలాగే అంతా ఒకే రకం టిఫిన్ తినేటట్లుగా చూడండి. ఎందుకంటే తలో రకం టిఫిన్ చెయ్యాలంటే మీకు డబ్బు, శ్రమ వృథా అవుతాయి. వంట పాత్రలను ఎక్కువ వాడాల్సిన అవసరం లేదు.
- వేసవికాలంలో దాహంవల్ల మనం ఇష్టం వచ్చినట్లుగా కూల్‌డ్రింక్‌ల మీద ఖర్చు పెడతాం. వాటికంటే హాయిగా ఓ చక్కటి మంచినీళ్ళకుండని ఉంచుకుంటే, డబ్బు ఆదా కావటమే కాక ఆరోగ్యం సైతం దివ్యంగా ఉంటుంది.
- క్రితం రోజురాత్రి మిగిలిపోయిన అన్నంతో మీరు మరుసటి రోజు పులిహోర, టమాటోరైస్, కొబ్బరి అన్నం తయారు చేసుకుంటే మీకు టిఫిన్ తయారవుతుంది.
- అలాగే ఉదయం మిగిలిపోయిన ఇడ్లీలను సాయంకాలం పూట ఉప్మాగా మర్చి ఇడ్లీఉప్మా చేసుకోవచ్చు. దానివల్ల మీకు ఒక వెరైటీ టిఫిన్ తయారవడమే కాక డబ్బు ఆదా అవుతుంది.



## అన్నం వృథా చేయకూడదు

'అన్నం పరబ్రహ్మ స్వరూపం' అంటారు. కాబట్టి అన్నాన్ని వృథా చేయకూడదు. మీరు ఇంట్లో తిన్నా, హెూటల్‌లో తిన్నా మీకు కావాల్సినంతే తినండి. కాని అన్నాన్ని వదిలి వెళ్ళకండి. మీరు ఎంత తింటారో అంతే తినండి. అంతేకాని వృథా చేయకూడదు. అందుకే అన్నం వడ్డించుకునే ముందు మీకెంత కావాలో, మీరు ఎంత తినగలరో అంతే వడ్డించుకోండి.



# సాధారణ షాపింగ్ టిప్‌లు

నిజానికి షాపింగ్‌కి వెళ్ళేముందు మీరు కొన్ని షాపింగ్ టిప్‌లు తెలుసుకోవాలి. మీరేదైనా కొనడానికి షాపింగ్ వెళ్ళేటపుడు ఈ క్రింది ప్రశ్నలే వేసుకెళ్ళండి.

- ఇది నాకు అవసరమా? లేక అనవసరంగా కొంటున్నామా?
- ఇది లేకుండా నేను బ్రతకలేనా?
- దీనికి బదులు ప్రత్యామ్నాయపు వస్తువు ఇంతకు ముందే మన వద్ద ఉందా?
- ఈ వస్తువుని కొనే డబ్బు సంపాదించడానికి నేను ఎంతకాలం కష్టపడాలి?
- వీలైనంతవరకు మీరే ఆ వస్తువుల ఉత్పత్తిదారుల దగ్గర కొనండి. అంటే మధ్యవర్తులను వదిలెయ్యండి. అంటే అప్నా బజార్ లాంటి వాటిలో కొనవచ్చు.
- దానికి ఏదైనా ప్రత్యామ్నాయం చవకలో లభిస్తుందా?
- అది తాజాగా ఉందా?
- త్వరలో నాశనమయ్యే దానిని కొనకుండా ఉండడానికి ప్రయత్నించండి.
- వీలైతే క్యాష్ ఇచ్చి కొనండి. అప్పుకు పోకండి. అప్పు ఖరీదుతో కూడుకున్నది.
- వీలైతే అదే వస్తువు ఇతర షాపుల్లో ఎంత చెబుతున్నారో పరిశీలించండి.
- ఏదైనా డిస్కౌంట్ వుందేమో పరిశీలించండి. సాధారణంగా గట్టిగా అడిగిన వారికి డిస్కౌంట్ లభిస్తుంది.

---

**మీరు షాపింగ్‌కి వెళ్ళకపోతే మీ క్రెడిట్ కార్డులను ఇంట్లోనే ఉంచండి. వాటిని ఎప్పుడూ జేబులో ఉంచుకుంటే ఖర్చులు పెరిగే అవకాశాలు ఎక్కువ.**



# సాధారణ షాపింగ్ టిప్‌లు

- షాపుకు వెళ్లేముందు మీకేం కావాలో లిస్ట్ తీసుకెళ్ళండి. దానివల్ల చూసిన ప్రతిదానిని కొనడాన్ని నివారించవచ్చు.
- స్థానికంగా తయారుచేయబడ్డ వాటినే కొనండి. అవి ఇక్కడ తయారు చేయబడతాయి కాబట్టి తాజాగా ఉంటాయి.
- కొనేటప్పుడు వాటి మీద గడువు (expiry) తేదీని పరిశీలించండి. ఒకవేళ Expiry date అయిపోతే వాటిని నిరాకరించండి.
- వీలైతే దానిని మీరు కొనడానికి బదులు తయారుచేయడానికి ప్రయత్నించండి.

## మనీ సేవింగ్ టెక్నిక్స్

- ఒక పెద్ద భవనంలో కుక్కలను మేపుతూ ఖర్చు పెట్టేకంటే ఒక పెద్ద అపార్ట్‌మెంట్‌లో సురక్షితంగా, డబ్బు దుబారా తగ్గించుకుంటూ ఉండడం సర్వవిధాలా మేలు.
- ఒక అపార్ట్‌మెంట్‌ని కొనేకంటే ఒక పెద్ద స్థలాన్ని నలుగురయిదు గురు బంధువులు లేదా సహోద్యోగులు కొనుక్కొని అందులో ఫ్లాట్‌ల్లాగా కట్టించుకుంటే మంచి నాణ్యతతో పాటు ఫ్లాట్ చవకగా కూడా వస్తుంది.
- సాధారణంగా మన వాచీలో సెల్ అయిపోతుంది. దానిని వాచి రిపేర్ షాపులో తిరిగి వేయించాలంటే ముప్తై నుండి నలభై దాకా ఛార్జి చేస్తారు. నిజానికి ఆ సెల్ ఖరీదు ఏడు రూపాయలు. మీరు హైదరాబాద్‌లోని బేగంబజార్‌కి వెళ్ళి సెల్‌ని కొనుక్కొని మీ అంతట మీరే వేసుకోవచ్చు. లేదా ఆ సెల్‌ని తీసుకెళ్ళి వాచీ రిపేర్ షాప్‌కెళ్ళి ఐదు రూపాయలు ఇచ్చి వేయించుకోవచ్చు.

**ఒక పెద్ద పడవలో చిన్న కన్నం పడి నీరు వచ్చి ఎలా ముంచేస్తుందో, అలా చిన్న చిన్న ఖర్చులే మొత్తం నాశనం చేస్తాయి సుమా!**



# ఇతర అద్వితీయ డబ్బు ఆదా మార్గాలు

- మీ ఎటిఎం కార్డుని వీలైనంత తక్కువగా ఉపయోగించండి. అందువల్ల ఛార్జీలు తక్కువ పడే అవకాశం ఉంటుంది.
- ఇంట్లో ఎప్పుడూ లక్షలు లక్షలు నగదు ఉంచుకోకండి. వాటిని బ్యాంకులో వేసుకుంటే వడ్డీ రావడమే కాకుండా దొంగల బెడద కూడా ఉండదు.
- జేబులో ఎక్కువ క్యాష్ ఉంచుకోకండి. వాటివల్ల బజార్లో అవసరం లేని వస్తువులు కొనే అవకాశం ఉండదు.
- అధిక డబ్బు సంపాదించాలన్న ఆశతో పేకాట, జూదాలను అలవాటు చేసుకోండి. ఒకవేళ మీరు స్టాక్ మార్కెట్‌లో ఇన్వెస్ట్ చేయాలన్నా ఇంతకు మించి డబ్బు పెట్టుబడి పెట్టకూడదు అన్న పరిమితిని ఉంచుకోండి.
- కుటుంబ సభ్యులు నలుగురూ కలిసి హోటళ్ళలో భోంచేసే కంటే ఒక ఫుల్ మీల్స్ ప్యాక్ తెచ్చుకుంటే డబ్బు ఆదా అవుతుంది. పైగా ఇంట్లో టీవీ చూస్తూ లేదా కబుర్లు చెప్పుకుంటూ తినేయవచ్చు.
- ఈ మధ్య ప్లాస్టిక్ బ్యాగులు నిషేధించారు. అందువల్ల షాపింగ్‌కు వెళ్తున్నప్పుడు మీరు చేతి సంచి తీసుకువెళ్ళండి. లేకపోతే బయట డబ్బులు పెట్టి క్యారీబ్యాగులు కొనాల్సి వస్తుంది.
- వేసవికాలం రాకముందే ఏసీ మిషన్ కొనండి. ఇలాంటి ఆఫ్ సీజన్‌లలో స్వెట్టర్లు, ఫ్యాన్‌లు, ఏసీలు తక్కువ ధరకు లభిస్తాయి.
- మిఠాయి షాపులకు, హోటళ్ళకు ఎప్పుడూ కాలే కడుపుతో వెళ్ళకండి. అందువల్ల ఎక్కువ తినే అవకాశం ఉంటుంది. దాంతో డబ్బే కాకుండా ఆరోగ్యం సైతం చెడిపోయే అవకాశాలు ఉంటాయి.



# ఇతర అద్వితీయ డబ్బు ఆదా మార్గాలు

- ఈమధ్య ప్రతి వూర్లలో లేదా వీధుల్లో వారానికొకసారి కూరగాయల సంత లేదా మండీ పెడుతున్నారు. అక్కడ కూరగాయలు, పండ్లు, ఆకుకూరలు బయట దుకాణాల కంటే చవకగా దొరుకుతాయి. ఇలాంటి అవకాశాలను సద్వినియోగం చేసుకోవచ్చు.

- నమ్మకస్తులైన మెకానిక్‌ని, టైలర్‌ని, డ్రైవర్‌ని పెట్టుకోండి. మంచి మెకానిక్ వల్ల మీ వాహనం చెడిపోదు. అలాగే మంచి టైలర్ వల్ల మీరు వందలు, వేలు పెట్టి కొన్న బట్టలు త్వరగా కురచగా లేదా అస్తవ్యస్తంగా తయారయ్యే అవకాశాలు ఉండవు.

- పెద్ద పెద్ద షాపింగగ్ మాల్స్‌లలో ఇన్ని వస్తువులు కొంటే ఇంత తక్కువకు ఇస్తాం అని ప్రకటిస్తాయి. అలాంటి ఉత్పత్తులు మీరు వాడేటట్లయితేనే కొనండి. లేదా అసలుకే సమస్య రావచ్చు. అంతేకాదు, మీరు నచ్చని దుస్తులు, కుక్కర్‌లు వెంటనే వాపసు చేసి వేరేవి తీసుకోండి. ఆలస్యమైతే షాపువారు వేరేవి ఇవ్వకపోవచ్చు.

- అప్పు అడిగిన ప్రతివారికీ డబ్బు ఇవ్వకండి. ఎందుకంటే ఆ అప్పు అడిగేవారు ఇవ్వకపోతే వారి చుట్టూ తిరిగి మన డబ్బు, సమయంతో పాటు మానసిక శాంతిని సైతం పోగొట్టుకోవాల్సి వస్తుంది. అందుకే ఎవరైనా డబ్బు అడగగానే 'అరే! మొన్ననే అపార్ట్‌మెంట్ కొనడానికి ఉన్నదంతా ఊడ్చి ఇచ్చాను' అని ఏదొక వంక చెప్పండి. అంత్యనిష్ఠూరం కంటే ఆది నిష్ఠూరం బెస్ట్ కదా!

- పొరబాటున కూడా క్రెడిట్‌కార్డుని తీసుకోకండి. అలాంటివి 'నిను వదలని నీడను' అన్నట్లుగా జీవితాంతం వెంటాడుతూనే ఉంటాయి. ఆ క్రెడిట్



# ఇతర అద్వితీయ డబ్బు ఆదా మార్గాలు

కార్డుల వారు బోలెడు వడ్డీ, ఫైనుల మీద ఫైనులు వేసి వెంటాడుతాయి. పైగా ఓ ఐదు పైసలు బాలన్స్ ఉన్నా ఓ ఐదేళ్ళ తర్వాత పాతికవేల బాలన్స్ ఉన్నట్లుగా వడ్డీల మీద వడ్డీలు, జరిమానాలు మీద జరిమానాలు వేలల్లో వసూలు చేస్తాయి.

- నిజానికీ సినిమాలు ఈ రోజుల్లో చాలా ఖరీదుగా ఉన్నాయి. దాని బదులు త్యాగరాయ గానసభకో, సుందరయ్య గానసభలో జరిగే సంగీత, కళానృత్యాలు మిమ్మల్ని ఎంతో అలరిస్తాయి. పైగా వాటిలో ప్రవేశం ఉచితం కూడా! దానికి తోడు సినిమా చెత్తగా ఉంటే ఆ వచ్చే మానసిక వికాసం కూడా పోతుంది.

- మీరు వృద్ధులైతే, వృద్ధులకిచ్చే ప్రయాణ సౌకర్యాలను పూర్తిగా సద్వినియోగం చేసుకోండి. ఉదాహరణకు –

  1. వృద్ధులకు బ్యాంక్ వారు సేవింగ్స్ అకౌంట్‌లో ఒక శాతం లేదా అర శాతం వడ్డీ ఎక్కువ ఇస్తారు.
  2. ఇన్‌కమ్‌టాక్స్ రిటన్‌లో సైతం వృద్ధులకు తక్కువ పన్ను పడుతుంది.
  3. బస్సుల్లో, రైల్వేలో వృద్ధులకు ప్రత్యేక తగ్గింపు ఉంటుంది.

- పచారి షాపులకు, మాల్స్‌కు మీతో పాటు మీ పిల్లలను తీసుకెళ్ళకండి. వారు మీకు అవి కావాలి, ఇవి కావాలని టెండర్ పెట్టి బోలెడు డబ్బు వృథా చేయిస్తారు.

- ఇంట్లో ఏదైనా రిపేర్ వస్తే త్వరగా చేయించండి. లేకపోతే ఆ ఐటమ్‌ని పూర్తిగా మార్చాల్సి వస్తుంది. అందువల్ల గోటితో పోయే దానికి గొడ్డలి సామెతలా డబ్బు ఖర్చవుతుంది.



## అద్వితీయ డబ్బు ఆదా టెక్నిక్

### మీ డబ్బుని హరింపచేసే వృథాలు

ఈ క్రింది చర్యలు మీ డబ్బుని హరింపచేసే సాధనాలు.

1. ఇతరులకు అప్పులు ఇవ్వడం (అధిక వడ్డీకి)
2. జూదం, గుర్రప్పందాలు, పేకాట, బ్రాకెట్, బెట్టింగ్‌లు.
3. కార్లు, వాహనాలు కొనడం
4. క్రెడిట్ కార్డులు
5. ఫైవ్‌స్టార్ హోటళ్ళలో దొరికే టిఫిన్‌లు, భోజనాలు
6. ఖరీదైన ఆటబొమ్మలు (కొన్నాళ్ళ తర్వాత పనికి రానివి)
7. ఖరీదైన రెడీమేడ్ దుస్తులు (కొన్నాళ్ళయితే కురచ అయ్యేవి)
8. ఊరికి మైళ్ళదూరంలో ఎందుకూ పనికిరాని ప్లాట్‌లు, స్థలాలు
9. ఫండమెంటల్స్ లేని షేర్లలో పెట్టుబడి పెట్టడం
10. బైక్‌తో సరిపోయే దానికి పనిమాలా కారు కొనడం
11. ప్రక్కవారు కొన్నారు కదా అని ప్రిస్టేజ్‌కు పోయి ఆ వస్తువు అవసరం లేకపోయినా కొనడం.





## అద్వితీయ డబ్బు ఆదా టెక్నిక్

# ప్రభుత్వ హోమియోపతి, అల్లోపతి హాస్పిటల్‌లో వైద్యం ఉచితం

ప్రభుత్వం హోమియోపతి, అల్లోపతి హాస్పిటళ్ళని నెలకొల్పింది. ఇందులో ఉచితంగా వైద్యం చేస్తారు. ఇందులో ఫీజు ఉండదు.

చక్కటి నిపుణులైన డాక్టర్లు ఇందులో అందుబాటులో ఉంటారు. ఇప్పటి ప్రైవేట్ డాక్టర్ల మాదిరిగా డబ్బే ధ్యేయంగా మారి వ్యాపార దృక్పథంతో కాకుండా ప్రజలకు నిజమైన సేవ చేయడం ఈ హోమియోపతి, అల్లోపతి కర్తవ్యం.

చాలామందికి ఇలాంటి వాటి గురించి తెలియదు. తెలిసినా అవి పేదవారికి మాత్రమే అనుకుంటారు. కాని అది తప్పు. ఎవరైనా సరే వెళ్ళి వైద్యం చేయించుకోవచ్చు. మీ వూర్లోని హెల్త్‌సెంటర్ల దగ్గర ఈ రకమైన సేవలు లభించవచ్చు. పైగా ఇందులో డాక్టర్లు పాతతరానికి చెందినవారు. అప్పటివారిలో సేవాదృక్పథం ఎక్కువ.

కాబట్టి ప్రభుత్వ ఆధ్వర్యంలో నడుపబడుతున్న ఈ హోమియో, అల్లోపతి సేవలను మీరు సైతం పొందవచ్చు.





## అద్వితీయ డబ్బు ఆదా టెక్నిక్

## అద్భుతమైన ఆయుర్వేద ప్రాజెక్టులు చవకగా పొందండి

ప్రస్తుతం ఆయుర్వేద ప్రాజెక్టులకు అద్భుత డిమాండ్ ఉంది. వీటివల్ల సైడ్ ఎఫెక్ట్సులు లేకపోవడం వల్ల ప్రజలు ఎక్కువగా వీటిని అనుసరిస్తున్నారు.

అయితే 'పురుషుల్లో పుణ్యపురుషులు' వేరయా. ఈ ఆయుర్వేద ప్రాజెక్టుల్లో సైతం కమర్షియలైజ్ అయినా చక్కటి నాణ్యమైన, చవకగా లభిస్తున్నాయి. ముఖ్యంగా రామ్‌దేవ్‌బాబా, ఆసారాంబాపూజీ లాంటి సత్పురుషులు తయారుచేసే ప్రాజెక్టులు అద్భుతమైన నాణ్యతతో సరసమైన రేట్లలో లభ్యమవుతున్నాయి. సబ్బుల దగ్గర నుండి అన్ని రకాల జబ్బులకు ఈ ఆయుర్వేద ప్రాజెక్టులు లభ్యమవుతున్నాయి.

ఈ రామ్‌దేవ్ బాబా, ఆశారాం బాపూజీలా ఆయుర్వేద షాపుల్లో ఉత్పత్తులు –బయట ఆయుర్వేద షాపుల్లో వారి కంటే చవకగా, నాణ్యతగా, అత్యుత్తమ ప్రమాణాలతో కూడి ఉన్నాయి.

కాబట్టి నాణ్యమైన ఆయుర్వేద ప్రాజెక్టులు కావల్సిన వారు వీటిని సద్వినియోగం చేసుకోవచ్చు.





## అద్వితీయ డబ్బు ఆదా టెక్నిక్

## జనరిక్ మందులతో మీ డబ్బు కనీసం 50శాతం మిగులు

ప్రస్తుతం మందులరేట్లు ఆకాశాన అంటుతున్నాయి. ఈ నేపథ్యంలో జనరిక్ మెడికల్ షాపులు కేవలం చాలా తక్కువ ధరకే మందులు అమ్ముతున్నాయి.

బి.పి., షుగర్, గ్యాస్ట్రబుల్, గుండెజబ్బులు, నరాల బలహీనత, ఎలర్జీ, విటమిన్, క్యాల్షియం టాబ్లెట్లు సుమారుగా 350 రకాల జనరిక్ మందులు మీకు అందుబాటులో వచ్చాయి.

కాబట్టి ఈ జనరిక్ షాపుల్లో మందులు కొంటే మీ నెలసరి మెడికల్ బిల్లు సగానికి పైగా తగ్గుతుంది.

కాకపోతే సిటీలో అవెక్కడ ఉన్నాయో తెలుసుకోవాలి. ఈ జనరిక్ ఔషధాలు చౌకే కాకుండా ఉత్తమమైనవి.

వీటి ద్వారా మీరు చాలా డబ్బుని ఆదా చేయవచ్చు.





## అద్వితీయ డబ్బు ఆదా టెక్నిక్

## ప్రపంచ ఆర్థికవేత్తలంతా ముక్తకంఠంతో ఘోషించే సూత్రం

మీరు సంపాదించే డబ్బులో **ప్రతి నెలా పదిశాతం పక్కన పెడితే** కొన్నాళ్ళ తర్వాత అవే లక్షలు, కోట్లు అవుతాయి. ఇది ప్రపంచంలో ఆర్థికవేత్తలు ముక్త కంఠంతో చెప్పే సత్యం.

ప్రతినెలా కేవలం పదిశాతం మీ ఆదాయం పొదుపు చేయండి. చాలు. అదే మీకు భవిష్యత్తులో శ్రీరామరక్షలాంటిది.

అదే మీ రిటైర్‌మెంట్‌లో, వార్ధక్యంలో ఎంతో సురక్షితంగా ఆర్థికంగా ఆదుకునే మహత్తర సత్యమని ప్రపంచంలో ఏ ఆర్థికవేత్తనడిగినా చెప్పే నగ్నసత్యం సుమా!



## టాటా, బిర్లాల వలె కోట్లు సంపాదించాలి గాంధీ మహాత్ముడిలా సింపుల్‌గా జీవించాలి

దీనర్థం - మనం ఎంత డబ్బు సంపాదించినా గాంధీ మహాత్ముడిలా నిరాడంబరంగా జీవించాలి. తన దుస్తులు తానే ఉతుక్కుంటూ, ఎక్కడికి వెళ్ళినా కాలినడకన వెళ్తూ చాలా సింపుల్ బ్రతికేవారు గాంధీజీ. అందుకే డబ్బుని చాలా పొదుపుగా ఖర్చుపెట్టుకునేవాడే గొప్పవాడు. అలాంటి వారే ఎక్కువ కాలం బ్రతుకుతారు.

## ఎవరికైనా అప్పులు ఇవ్వకండి

జీవితంలో మీరు సుఖంగా ఉండాలంటే అడిగిన వారికి అప్పులు ఇవ్వకండి. అడిగినవారు మీ మిత్రులు కానీయండి. బంధువులు కానియ్యండి. కాకపోతే ఒకే ఒక మినహాయింపు. ఏదైనా హాస్పిటల్స్, ప్రాణం మీదకు వస్తే తప్పక సహాయం చేయాలి కదా!

అప్పులు ఇస్తే-

1. మీ అప్పు మీకు తిరిగి రాకపోవచ్చు.
2. అది అడిగినందుకు మీ స్నేహం / బంధుత్వం దెబ్బతినవచ్చు.
3. మీకు మానసిక వేదన తప్పకపోవచ్చు.

సో బీ కేర్‌ఫుల్ అప్పులు ఇచ్చేటప్పుడు!





## అద్వితీయ డబ్బు ఆదా టెక్నిక్

### ఆదివారం రోజు ఫుట్‌పాత్ మీద దొరికే పాత పుస్తకాలు చాలా చౌక

ఈ రోజుల్లో పుస్తకాల రేట్లు ఆకాశాన అంటుతున్నాయి. న్యూస్‌పేపర్ రేటు, ప్రింటింగ్ రేట్లు గగనాన ఉన్న సందర్భంలో ఏ పుస్తకమైనా హెచ్చురేటులోనే ఉన్నాయి. ఈ నేపథ్యంలో మీ వూరిలో ప్రతి ఆదివారం ఫుట్‌పాత్ మీద పాత పుస్తకాలు అమ్ముతారు. వారి దగ్గర కాంపీటీటివ్ పుస్తకాల దగ్గర నుండి పాత కథల పుస్తకాలు, మేగజైన్‌లు చాలా తక్కువ ధరకే లభిస్తాయి.

అంతే కాదు, మామూలు షాపుల్లో దొరకని అపురూప పుస్తకాలు సైతం ఈ ఫుట్‌పాత్ మీద దొరుకుతాయి. అంతేకాదు, ఎన్నో డాలర్లకు లభించే విదేశీ పుస్తకాలు సైతం చాలా తక్కువ ధరకే  లభిస్తాయి.

ఎటొచ్చి మీకు ఓపిక ఉండాలే కాని మణిపూసల్లాంటి అరుదైన పుస్తకాలు చాలా తక్కువ ధరకే లభిస్తాయి.

కాబట్టి ఈ పుస్తకాల ద్వారా మీరు ఎంతో బిల్లుని ఆదా చేయవచ్చు.



## మీ డబ్బుని వినియోగించే అద్వితీయ మార్గాలు

సరే ఈ పుస్తకం మొత్తం చదివారు కదా! ఈ క్రింది అద్వితీయ మార్గాలను అనుసరించండి.

### మీ డబ్బు మొత్తం ఎప్పుడు ఒకే పెట్టుబడిలో ఉంచకండి

ఉదాహరణకు బంగారం. ఇటీవల రూ. 3200/- నుండి రూ. 2500/- దాకా పడిపోయింది. అందుకే స్థలాలు, మ్యూచువల్ ఫండ్స్, ఇతర సేవింగ్స్ స్కీమ్‌లలో ఉంచండి.

### ఇల్లు / అపార్ట్‌మెంట్ కొనండి

ఈ ఇల్లు / అపార్ట్‌మెంట్ ధరలు ఎప్పుడూ పెరుగుతూనే ఉంటాయి. అందుకే ఒక ఇల్లు / స్థలం కొని పెట్టుకొని ఉంటే మీకు సురక్షితం.

### అప్పులు చెల్లించండి

అప్పులు ఖరీదైనవి. వడ్డీలు మీద వడ్డీలు, జరిమానాలు పడతాయి. అందుకే అప్పులు వెంటనే తీర్చేయండి.

### మీ పొదుపు ఆదాకై చిట్ వేయండి

అందువల్ల ప్రతి నెలా కొంతమొత్తం అందుకు వినియోగించాల్సి రావడం వల్ల మనకు డబ్బు ఆదా చేయాలన్న భావన కలుగుతుంది. పైగా ఆ చిట్ మొత్తం మనలను ఏదో సమయంలో ఆదుకుంటుంది. పైగా చీటీలలో నెలకు దాదాపు రెండు శాతం వడ్డీలా లభిస్తోంది.

### రిపేర్లు నేర్చుకోండి

కరెంట్ ఫ్యూజ్‌పోయిందా? ఎలక్ట్రీషియన్‌ని పిలిపిస్తే రూ. 50/- లాగుతాడు. అలాగే పంపు లీక్ అవుతుందా? మరో వంద సమర్పించండి. అలా కాక మీరే చిన్న చిన్న రిపేర్లు నేర్చుకుంటే మానసిక తృప్తితో పాటు డబ్బు ఆదా అవుతుంది. పైగా రిపేర్ లేట్ అవుతుంటే చివరకు వాటిని బోలెడు డబ్బు ఖర్చుపెట్టి కొత్తవి మార్చాల్సి వస్తుంది.

### ఇంటర్‌నెట్ కనెక్షన్

ఇంటర్‌నెట్, కనెక్షన్ అవసరమైతేనే పెట్టించండి. వాటివల్ల నెలకు దాదాపు రూ. 350-500 దాకా జేబుకు చిల్లు. అందుకే బాగా అవసరమైతేనే పెట్టించండి.

# అతి ఆదా సర్వత్రా వృథా సుమా

ఆదా చేయడం ఒక అద్భుతమైన భావన. దానివల్ల జీవితంలో మీరు ఎంతో ఆనందాన్ని పొందుతారు. తనకున్న దాంట్లో సంతృప్తి పొందడం, ఆదాతో ఆనందాన్ని పొందటం మించిన తృప్తి దేనిలో రాదు. అయితే అతి ఆదా పనికి రాదు. దానివల్ల చాలా కష్టనష్టాలు ఉంటాయి.

మా ఇంటి దగ్గర ఒక పెద్ద మనిషి ఉన్నాడు. నేను ఒక రోజు నేను వాకిట్లోకి అమ్మకానికి వచ్చిన 'కాళ్ళు తుడుచుకునే పట్టా'ని కొంటుంటే ఆయన వచ్చాడు. 'ఎంతకు కొంటున్నారు' అని ఆయన అడిగితే 'యాభై' అన్నాను.

'అబ్బే! నలభై కదండీ! నేను నలభైకే కొన్నాను. పైగా పది రూపాయలు ఆదా కదండీ' అన్నాడు.

'మీరెక్కడ కొనుక్కొచ్చారండీ' అని అడిగాను.

"సికింద్రాబాద్‌లో అంజలీ టాకీస్ పక్క సందులో.... ఇలాంటివి అక్కడ చాలా చవక."

నేనేం మాట్లాడలేదు.

కాని మేము ఉండేది చార్మినార్ దగ్గర. ఇక్కడ నుండి సికింద్రాబాద్‌కి వెళ్ళడం... అదీ పది రూపాయల 'ఆదా' కోసం.

రూపాయి మిగులు కోసం పది రూపాయలు ఖర్చుపెట్టడం ఆశ్చర్యం! కేవలం ఖర్చే కాకుండా శ్రమ, సమయాన్ని సైతం వృథా చేసుకోవడం చాలా అబ్జర్డ్‌గా అనిపించింది. చెంచా మిగులుతుంది. ఫ్రీగా బహుమతి వస్తుందని, చెంచా కోసం పట్టుచీర కొనేవారు ఉన్నారు.

కేవలం ఒక చిన్న ఐటమ్ కోసం అలా సమయాన్ని వృథా చేసుకుంటూ వెళ్ళడం ఏమాత్రం సమంజసంగా ఉండదు. అదే పదేసి ఐటమ్‌లు ఒకే చోట దొరుకుతుంటే అక్కడ కొని తెచ్చుకుంటే ఆదా అవుతుంది. కాబట్టి ఆదా చేయడం మంచిదే. కాని అతిఆదా పిచ్చితనం అని తెలుసుకోవాలి.

## మనీ సేవింగ్ టెక్నిక్స్

మీ బ్యాంక్ అకౌంట్‌లో వెయ్యి రూపాయలు ఉండి, మీ క్రెడిట్ కార్డు అకౌంట్‌లో మీరు ఏడొందల రూపాయలు కట్టాలనుకోండి. అప్పుడు మీరు బ్యాంక్ అకౌంట్‌లోని డబ్బు డ్రా చేసి మీ క్రెడిట్ కార్డు అకౌంట్‌లో కట్టెయ్యండి. అందువల్ల క్రెడిట్ కార్డు మీద పడే అధిక వడ్డీ తగ్గుతుంది. చాలామందికి డబ్బున్నా కట్టబుద్ధి కాదు. కాని ఎప్పటికైనా కట్టాల్సిందేనని తెలుసుకోండి.

# కొన్ని బేరమాడే టెక్నిక్‌లు

షాపువాడితో చాకచక్యంగా మాట్లాడాలి. ఎలాగో ఇక్కడ చూద్దాం.

ఇళ్ళు అమ్మేవారితో 'ఏమిటోనండి! అంతా వాస్తు తప్పుగా ఉంది. మా ఆయన / భార్య వద్దన్నా నేనే ఆలోచిస్తున్నాను" అనడం ఒక టెక్నిక్.

అలాగే మామూలు కిరాణాషాపు. కూరగాయల వారితో "ఆ బేగంబజార్ లేదా మోండా మార్కెట్‌కి వెళ్తే నీవు ఇచ్చే కిలో ఐదు రూపాయల బెండకాయలే అక్కడ కిలో రెండ్రూపాయలకే దొరుకుతాయి. కాకపోతే దూరం కదాని ఆలోచిస్తున్నాను" అని చూడండి.

ఆటోవాడితో వేగంగా తిరుగుతున్న మీటర్ గురించి "పదేళ్ళ నుండి ఇదే రూట్‌లో తిరుగుతున్నాను. మీటర్‌గురించి నాకే చెబుతావా? నాకు బాగా తెలుసు, పద! కావాలంటే ట్రాఫిక్ డిఎస్‌పి సామంత్‌గారితో మాట్లాడుదాం" అనండి.

## మనీ సేవింగ్ టెక్నిక్స్

మీ పిల్లలు ఆడుకున్న బొమ్మలు కొన్నాళ్ళకు పాతవి అయిపోతాయి. వాటిని ప్రక్కింటి వాళ్ళకో, ఇతరులకో ఇచ్చి, వారి బొమ్మలను మీ పిల్లలకు మార్పిడి చేయండి. అందువల్ల ఇరు వర్గాలకు ఆ బొమ్మలు వెరైటీగా కన్పిస్తాయి. తర్వాత బోలెడు డబ్బు ఆదా అవుతుంది.

### త్రీ ఇన్ వన్ టెక్నిక్

మీ పిల్లలకు మీరే ట్యూషన్ చెప్పకుంటే ట్యూషన్ ఫీజు ఆదా అవుతుంది. మీ పిల్లలతో మీరు ఎక్కువసేపు గడపవచ్చు. పక్కింటి పిల్లలకూ ట్యూషన్ చెప్పవచ్చు.

## పైసా కూడా నష్టపోకుండా బేరం ఆడటం ఎలా?



బేరమాడడం ఒక కళ. అయితే చాలామందికి ఒక వస్తువు నిజానికి ఎంత ఖరీదు చేస్తుందో, దానికి ఎంత వరకు బేరమాడవచ్చో తెలియదు. పైగా ఆ వస్తువుని అంత తక్కువకి అడిగితే షాపువాడు ఏమనుకుంటాడో అన్న భయం ఉంటుంది.

నిజానికి బేరమాడటం వల్ల తప్పు లేదు. ఒకో వస్తువు పాతిక రూపాయలకు కొని వంద రూపాయలకు అమ్మే ఈ కాలంలో మనం అడిగిన వస్తువుని సగానికి అడిగినా తప్పలేదు. బేరమాడటాన్ని స్టేటస్‌కి భంగం అనుకోకూడదు. దానివల్ల ఎంతో డబ్బు ఆదా అవుతుంది. ఈ నేపథ్యంలో అసలు బేరం ఎలా ఆడాలో, ఏ పాయింట్ వద్ద ఆదా ఉంటుందో తెలుసుకుందాం.

ఉదాహరణకు జామకాయలు కిలో నలభై రూపాయలు చెప్పాడు బండివాడు. మనం సగానికి అడుగుతాం. వాడు వింతగా చూస్తాడు. ముప్పయి ఐదుకు తక్కువ అసలే ఇవ్వలేనంటాడు. మీరు పాతిక రూపాయలు అంటారు. వాడు కోపంగా చూస్తాడు. మీరు అప్పుడు వెళ్ళిపోతూ "ముప్పయి రూపాయలు ఇస్తారా?" అని ఆఖరిగా అంటారు. అప్పుడు వాడు ఇవ్వనని తల అడ్డంగా తిప్పుతాడు. మీరు కదులుతారు. వెనుకనుండి వాడి కంఠం పిలుస్తుంది 'తీసుకోండి. అడిగిన ధరకే ఇస్తాను' అని. మీరు తీసుకుంటారు. ఈ పాయింట్... అదే మిమ్మల్ని వెనక్కి పిలిపించే ధర అసలైన సిసలు ధర. ఒకవేళ వాడు పిలవకపోతే వాడికి గిట్టుబాటు కాదన్నమాట. అప్పుడు మీరే వెనక్కి వచ్చి 'సరే ఆఖరిగా ముప్పయి రెండుకు ఇస్తావా' అనండి. వాడు ఇస్తాడు. వాడు ఇవ్వకపోతే మీకు ఆ పండ్లు అవసరమనుకుంటే ముప్పయి ఐదుకే రూపాయలకు కొనండి. అంతే.

# అన్నింటికంటే గొప్ప డబ్బు ఆదా టెక్నిక్

## సంతృప్తి

మీకు ఉన్నదాంట్లో సంతృప్తిగా ఉండడం కంటే గొప్ప సుగుణం మరొకటి లేదు. గుర్తుంచుకోండి ఈ ప్రపంచంలో మనకు లేనిది ఇంకొకరికి ఉందన్న అసంతృప్తే అన్ని అనర్థాలకు కారణం.

సాదా సీదా జీవితం గడపడం మేలు. లేనిపోని ఆడంబరాలకు, అత్యాశకు పోవడమే అన్ని సమస్యలకు మూలం. సంతృప్తికి నిర్వచనం మహాత్మాగాంధీ. తన నూలు తాను వడుక్కునేవారు. ఎక్కడికి వెళ్ళాలన్నా కాలినడకనే నడిచేవారు.



# మీ డబ్బు మోసపోయే అవకాశాలు

కేవలం డబ్బుని ఆదా చేయడమే గాక మీ డబ్బు ఎక్కడెక్కడ మోసపూరితంగా నష్టపోతుందో కూడా గమనించాలి. చాలామంది వ్యాపారస్తులు డబ్బు సంపాదించేది వస్తువుల క్రయ విక్రయాల మీద తేడా వల్ల కాదు సుమా! తూకంలో తేడాలు, కల్తీలు వగైరా ద్వారా వారు మోసానికి పాల్పడుతారు. అలాంటి మోసాలను తెలుసుకొని అరికట్టడం ద్వారా కూడా మనం చాలా డబ్బుని ఆదా చేసుకోవచ్చు. అదెలాగో ఇక్కడ చూద్దాం.

**1. ఆటోమీటర్లు :** చాలా ఆటోల మీటర్లు ఒక దానికొకటి పొంతన లేకుండా ఉంటాయి. ఒక ఆటో ఫలానా దూరానికి ఎనిమిది రూపాయలు చూపిస్తుండగా, ఇంకోటి తొమ్మిది, మరొకటి ఎనిమిదిన్నర చూపిస్తుంది. ఆటోమీటర్‌లు తిరిగే చక్రానికి ఎక్కువ పళ్ళు వచ్చేలా చేయడం ద్వారా వారు ఈ విధంగా మోసానికి పాల్పడుతుంటారు.



ఇలాంటి వాటిని మీరు రుజువు చేయడం కష్టం. కాబట్టి మీటరు ప్రకారం చెల్లించాల్సిందేనని ఆటోవాళ్ళు పట్టుబడుతుంటారు. కాబట్టి మీరు ఈ విషయంలో



## మనీ సేవింగ్ టెక్నిక్స్

1. ఏవైనా పప్పులు ఉడికించే ముందు ఒక గంట నానబెడితే త్వరగా వుడుకుతాయి. తద్వారా ఆదా అవుతుంది.
2. నెలసరీ సరిపడా సరుకులు ఒకేసారి తెచ్చుకోవడం పెద్ద కొనుగోలు ద్వారా ఆదాలు, రవాణా, సమయం కలిసి వస్తాయి.
3. నాన్‌స్టిక్ పాన్ (బాండి)ని ఉపయోగించడం వల్ల నూనె తక్కువ పడడమే కాకుండా టైము, గ్యాస్ సైతం ఆదా అవుతాయి.
4. మీరు వంట చేసేటప్పుడు వెడల్పు ఎక్కువ పాత్రలు, ఎత్తు తక్కువ పాత్రలు, ఉపయోగిస్తే గ్యాస్ ఆదా అవుతుంది. వండేటప్పుడు తప్పనిసరిగా మూత వుంచితే గ్యాస్ ఆదా అవుతుంది. వీలైనంతవరకూ కుక్కర్‌లోనే వండితే గ్యాస్ ఆదా అవుతుంది.



పట్టుదలగా ఉండండి. ఆటోమీటర్‌లోనే తప్పు ఉందని, కావాలంటే ట్రాఫిక్ ఇన్‌స్పెక్టర్‌తో తేల్చుకుందామని చెప్పండి. ఆటో ఎక్కేటప్పుడు మీరు పాటించాల్సిన మరో జాగ్రత్త ఉంది. అది మీ చేతిలో సరైన చిల్లర ఉంచుకోండి. ఎందుకంటే ఆటోలో మనం దిగాల్సిన చోటు రూ. 8-50 అయిందనుకోండి. యాభై పైసలు చిల్లర లేకపోతే ఆటోవాడు తిరిగి ఇవ్వడు. కాబట్టి ఆటో ఎక్కేటప్పుడు చిల్లర ఎప్పుడూ చేతిలో ఉంచుకొని ఎక్కడ ఉత్తమం.

**2. కిరాణవస్తువుల: బరువుల్లో తేడాలు:**



చాలామంది వ్యాపారస్తులు, కిరాణా వస్తువుల బరువుల్లో తేడాలు ఉంటాయి. ఉదాహరణకు కిలో ఉండాల్సిన ప్యాకెట్ లేదా కూరగాయలు 925 గ్రాములో ఉండడం కద్దు. ఆశ్చర్యం ఏమిటంటే పెద్ద పెద్ద సూపర్ మార్కెట్‌లో సైతం అలా తక్కువ గ్రాములు ఉండడం. నిజానికి ఇందులో వారి తప్పు లేకపోవచ్చు. వారికి సప్లయి చేసిన వారి తప్పు కావచ్చు. ఇలాంటి వాటి విషయంలో మనం నమ్మకమైన షాపు చూసుకోవడం మినహా మరో గత్యంతరం లేదు. వీలైతే మరోసారి తూకం చూసుకోవాలి.



## మనీ సేవింగ్ టెక్నిక్స్

డాక్టర్, అడ్వకేట్, టాక్స్ కన్సల్టెంట్ లాంటి వారి దగ్గరకు వెళ్లినప్పుడు గొప్ప ఆడంబరంగా వెళ్లకండి. సింపుల్‌గా వెళ్లండి. ఎప్పుడైతే మీరు సెల్ పట్టుకొని టిప్‌టాప్‌గా వెళ్తారో మీరు చాలా డబ్బున్నవారని తెలిసిపోతుంది. ఫలితంగా మీ దగ్గర మామూలు వాళ్లకంటే ఎక్కువ ఫీజు అడిగే అవకాశం ఉంది. కొంతమంది డాక్టర్లయితే అవసరమున్నా లేకపోయినా మీరు ధనికులు కాబట్టి లేనిపోని పరీక్షలు చేయించుకోమని రాస్తారు.

# మీ డబ్బు మోసపోయే అవకాశాలు

కొన్నిచోట్లా మీటర్ తులాభారాలు ఉంటాయి. అందులో సైతం సాంకేతికంగా బరువు ఎక్కువ ఉండేటట్లుగా అమర్చి ఉండవచ్చు. కాబట్టి ఇలాంటి మోసాల పట్ల అప్రమత్తంగా ఉండడం ద్వారా మన డబ్బులు ఆదా చేసుకోవచ్చు. కొన్ని పెట్రోలు బంకులు సైతం తమ మీటర్లలో అలా ఫిక్స్ చేసి తక్కువ పెట్రోలు పోస్తారు. అదేవిధంగా ఆయిల్ పాకెట్లు సైతం తక్కువ బరువు కలిగి ఉంటాయి.

**3. శాంపిల్స్ ఘనం: అసలు ఘోరం**



ఇటీవల మేము మా కాలేజీ వార్షికోత్సవం సందర్భంగా ఐదొందల స్వీట్ పాకెట్లు ఆర్డర్ ఇచ్చాం. ఆర్డర్ ఇచ్చే ముందు శాంపిల్ చూస్తే అవి అద్భుత రుచిని కలిగి ఉన్నాయి. సరే అని సంతోషంగా ఆర్డర్ చేశాం. కాలేజీ ఫంక్షన్ రోజు సప్లయి వచ్చాక రుచి చూస్తే నాసిరకంగా ఉన్నాయి. అలా మనకు శాంపిల్స్ ఘనంగా చూపించి – మనం ఫంక్షన్స్, పెళ్ళి హడావిడిలో ఉండడం చూసి నాణ్యత లేనివి సప్లయి చేస్తారు. జాగ్రత్త! ఇలాంటి వాటిని అరికట్టాలంటే వారికి ముందుగానే వార్నింగ్ ఇవ్వడమే కాకుండా, మొత్తం డబ్బు ఎప్పుడూ ముందుగా చెల్లించకూడదు. సప్లయి అయ్యాక ఇస్తామని చెప్పి, అవి సంతృప్తికరంగా ఉన్నాకే మనం డబ్బు ఇవ్వాలి సుమా! అలాగే మనం ఫంక్షన్ల హడావిడిలో ఉండడం చూసి వారూ కొన్ని ప్యాకెట్లలో బరువు తక్కువ ఉండేటట్లుగా చేస్తారు.



## మనీ సేవింగ్ టెక్నిక్స్

మీ కారు డ్రైవర్‌తోనే అటెండర్ లాంటి పనులు చేయించుకోండి. కిరాణా వస్తువులు తెచ్చి ఇవ్వడం లాంటి పనులు అతడికి చెపితే, దీనికోసం ప్రత్యేకంగా వేరే మనిషిని అప్పాయింట్ చేసుకోవాల్సిన అవసరం లేదు.

# మీ డబ్బు మోసపోయే అవకాశాలు

ఇంకొంతమంది కేటరింగ్‌వారు ఇన్ని (ఉదాహరణకు 200) ప్లేట్లకని మాట్లాడి, మనం ఫంక్షన్ల హడావిడిలో ఉండడం చూసి తక్కువప్లేట్లు (కేవలం 175)నే ఉంచుతారు. ఇలాంటివాటినన్నింటిని ఓ కంట కనిపెట్టాలి సుమా!

**4. భవనాలు, ఇళ్ళు కట్టడంలో మోసాలు**



చాలామంది అపార్ట్‌మెంట్లు, ఇళ్లు కొంటారు. స్వంత ఇళ్ళు కట్టించుకుంటారు. అలాగే అపార్ట్‌మెంట్లలో సైతం బిల్డర్ చెప్పిన వాటికి ఒప్పుకొని అడ్వాన్స్ ఇస్తారు. కాని ఇక్కడ సైతం వారు మోసానికి పూనుకునే అవకాశం ఉంది. బిల్డర్, కాంట్రాక్టర్లు మనకు చెప్పిందొకటి, చేసేది మరొకటిగా ఉంటుంది. తలుపులు, కప్‌బోర్డులు నాణ్యమైనవి పెడతామని చెప్పి, నాసిరకంవి పెడతారు. పైగా మార్బుల్ ఫ్లోరింగ్ అని చెప్తారు. కాని అందులో చవక రకమైన మార్బుల్ ఫ్లోరింగ్ వేస్తారు. ఇంకొంతమంది బిల్డర్లు మరి కొంత ముందుకు వెళ్ళి చదరపు అడుగులు సైతం తగ్గిస్తారు. 1000 చదరపు అడుగులు అని చెప్పి 950 లేదా 975 చదరపు అడుగుల ప్లాటే మనకు అంటగడతారు. మనకు లెక్కపెట్టడం తెలియదు. కాబట్టి మనం తీసుకుంటాం. కాని చక్కటి వాల్యుయేటర్ లేదా ఆర్కిటెక్ట్ చేత తిరిగి మొత్తం ప్లాట్‌ని లెక్క వేయించడం ఉత్తమం. తద్వారా మన డబ్బుని ఆదా చేసుకోగలం.

## మనీ సేవింగ్ టెక్నిక్స్



మీ పక్కింటివారితో షాపింగ్‌కి వెళ్ళి కొన్ని ఐటమ్‌లు షేర్ చేసుకుంటే మీకు బాగా ఆదా అవుతుంది. ఉదాహరణకు మీరు ఇద్దరు కందిపప్పు ఒక కిలో రూ. 32/- మీకు సగం కేజీ, పక్కింటి వారికి సగం కేజీ రూ. 18/- పెట్టే బదులు మీరిద్దరూ పంచుకుంటే రెండు రూపాయలు ఆదా అవుతాయి.

# మీ డబ్బు మోసపోయే అవకాశాలు

**5. కాలేజీలు, స్కూళ్ళు ఘనం**



చాలా కాలేజీలు, స్కూళ్ళు ఘనమైనవిగా కీర్తింపబడతాయి. నిజానికి ఆ కాలేజీలు, స్కూళ్ళు గత వైభవానికి చిహ్నాలు కావచ్చు. ఒకప్పుడు అవి చక్కటి టీచింగ్ స్టాఫ్ ఉండి క్రమశిక్షణతో ఉండి ఉండవచ్చు. నేడు ఆ ఉన్నతమైన స్టాఫ్ లేకపోవడం వల్ల ప్రమాణాలు పడిపోతాయి. గత వైభవపు చిహ్నాల వల్ల పిల్లలను ఆ కాలేజీల్లో, స్కూళ్ళలో జాయిన్ చేస్తుంటాం. ఆ తర్వాత ఆ కాలేజీల్లో ఎందుకు చేర్పించామా అని తలపట్టుకుంటాం. చాలా కాలేజీలు, స్కూళ్ళు గత వైభవాన్ని గురించి డబ్బా కొట్టుకుంటూ విద్యార్థులను లోపల వేస్తాయి. కాబట్టి మీరు మీ అబ్బాయి / అమ్మాయిలను ఆ కాలేజీలో జాయిన్ చేసేటప్పుడు ఆ కాలేజీ/ స్కూల్‌లోని గత సంవత్సరం విద్యార్థులను టీచింగ్ ఎలా ఉందో కనుక్కొని మరీ చేర్పించండి. అందువల్ల మీకు డబ్బు ఆదాకే కాకుండా మీ అబ్బాయి/ అమ్మాయి భవిష్యత్‌ని సరైన త్రోవలో ఉంచినవారవుతారు.

**6. ప్రకటనల మాయాజాలాలు**

చాలా న్యూస్ పేపర్లలో సెల్‌ఫోన్‌లు, టీవీలు, విసిఆర్‌లు, ఫ్రిజ్‌లు 'ఫలానా ధర, వెంటనే కొనుక్కోండి' అని ఆకర్షణీయంగా ప్రకటిస్తాయి. కాని వాటిలో ఎక్కువ సేల్సు టాక్స్, ఇతర టాక్స్‌లు కలపబడవని గమనించాలి. ఈ రచయిత మిత్రుడొకరు సెల్‌ఫోన్ రెంట్ కేవలం రూ. 450/– అని పరిగెత్తుకుంటూ కొనుక్కొన్నాడు. తీరా బిల్ వచ్చాక చూస్తే అందులో ఐదు శాతం సేల్సు టాక్స్, కాల్ ఐడెంటిఫికేషన్ ఫీజు రూ. 30/– అని ఇలా తడిపి మోపెడయ్యాయి. కాబట్టి మన డబ్బు ఇలా వృథా కాకుండా ఉండాలంటే అసలు ఆ వస్తువు మనకు ఫైనల్‌గా ఎంతకు వస్తుందో కనుక్కొని మరీ కొనుక్కోవడం ఉత్తమం.

# మీ డబ్బు మోసపోయే అవకాశాలు

పైవే కాదు. ఇంకా మన నిత్యం జీవితంలో ఎన్నో డబ్బు ఆదా మార్గాలు ఉన్నాయి.

- టైలర్‌కి బట్టలు కుట్టే నిమిత్తం ఇచ్చేటప్పుడు ఎక్కువ బట్ట ఇవ్వకండి. ఒకవేళ ఇస్తే ఆ బట్టని కట్ చేసి ఇవ్వమని అడగండి. లేకపోతే టైలర్ చిన్న కొడుక్కి ఒక చొక్కా అదనంగా వస్తుంది సుమా!
- పిండి మరకి బియ్యం, గోధుమలు పిండి నిమిత్తం ఇచ్చినప్పుడు కొంత శాతం పిండి మర తినేస్తుందని చెప్తారు. కాని అలా మిగిలిపోయిన పిండితోనే ఆ పిండిమర వాడు నెలంతా బ్రతుకుతాడని చాలామందికి తెలియదు. అందువల్ల పిండిమర వాడితో అసలు పిండి ఎంత వస్తుందో కనుక్కోండి. వీలైతే అక్కడే ఉండి పిండిని మర ఆడించుకొని ఇంటికి తీసుకెళ్ళండి.
- ఇటీవల చాలా వస్తువులకు నకిలీల బెడద ఎక్కువయ్యాయి. బ్రాండెడ్ వస్తువులు బాగా సేల్స్ అవడం వల్ల అలాంటివే తయారుచేసి షాపువారికి ఎక్కువ డిస్కౌంట్‌కు ఇస్తున్నారు. షాపువారు ఎక్కువ డిస్కౌంట్ వస్తుంది కదాని వాటిని కష్టమర్లకు అంటగడతారు. అసలు ఏవో, నకిలీ ఏవో తెలియదు కాబట్టి మనం కొంటాం. ఆ తర్వాత అవి ఎక్కువ కాలం మన్నిక ఉండవు. అందుకే మీరు షాపువారితో వస్తువులు కొనేటప్పుడు ఒరిజినల్ మాత్రమే కావాలి. నకిలీ అయితే పోలీసులకు రిపోర్ట్ చేస్తాం అని గట్టిగా మాట్లాడండి. బిల్లు కూడా అడిగి తీసుకొండి. మీతో రిస్క్ ఎందుకని షాపువారు మీకు ఒరిజినల్‌దే ఇచ్చే అవకాశం ఉంటుంది.



## మనీ సేవింగ్ టెక్నిక్స్

ధ్యానం, ప్రాణాయామం, పచ్చికూరగాయలు, పండ్లు అలవాటు చేసుకుంటే మీకు ఎక్కువ డబ్బు ఖర్చు కాదు. పైగా ఆరోగ్యం దివ్యంగా ఉంటుంది. పచ్చి కూరగాయలు ఆహారంగా తీసుకోవడం వల్ల జిహ్వాచాపల్యం తగ్గి మటన్, చికెన్‌లాంటి వాటి మీద వేలు ఖర్చు చేయాల్సిన అవసరం ఉండదు. జిమ్‌లు, మసాజ్ సెంటర్లు, హాస్పిటల్‌కెళ్ళి ఆక్సిజన్ పెట్టించుకునే బదులు యోగా, ధ్యానం, ప్రాణాయామం చేసుకుంటే బోలెడు డబ్బు ఆదా అవుతుంది. పైగా యోగా, ధ్యానం, ప్రాణాయామం సహజమైనవే కాక మా ఇంట్లోనే తీరిక సమయాల్లో చేసుకోవచ్చు.



# ఆదా చేసిన మీ డబ్బుని ఎక్కడ పెట్టుబడి పెట్టాలి?

చాలామంది దగ్గర మిగులు డబ్బు ఉంటుంది. దానిని ఎక్కడ నిలువ చేయ్యాలో అర్థం కాక తికమక పడ్తుంటారు. ఇంకొంత మందికి రిటైర్ అయ్యే సమయానికి డబ్బు వస్తుంది. వాటిని ఎక్కడ పెట్టుబడి పెట్టాలో అర్థం కాదు. అటు చిట్‌ఫండ్ కంపెనీలు మూత పడ్తున్నాయి. ఫైనాన్స్ కంపెనీలు బోర్డు తిప్పేస్తున్నాయి. కో ఆపరేటివ్ బ్యాంకులు దావాళా తీస్తున్నాయి. ఈ నేపథ్యంలో తమ డబ్బుని ఎక్కడ ఉంచాలో తెలియక సామాన్యులు తికమక పడ్తున్నారు. ఈ వ్యాసంలో రకరకా పెట్టుబడులను, వాటి లోటుపాట్లను గురించి సుదీర్ఘంగా వివరిస్తున్నాం. అందులో మీకు తగిన పెట్టుబడి వ్యూహాన్ని ఎన్నుకొని ఇన్వెస్ట్ చేయండి.

**1. షేర్లు :**



ఈ షేర్లు అనేవి రిస్క్‌తో కూడిన వ్యవహారం. కాబట్టి చూసి మరీ పెట్టుబడి పెట్టాలి. ఈ షేర్లు రెండు రకాలు. 1. ప్రైమరీ మార్కెట్, 2. సెకండరీ మార్కెట్.

ప్రైమరీ మార్కెట్‌లో అంటే ఒక కంపెనీ కొత్తగా ఆవిర్భవించేటపుడు తమ షేర్లని పబ్లిక్ ఆఫర్ చేసే నిమిత్తం అమ్ముతుంది. సాధారణంగా ఇవి ముఖ విలువలకు లభించడం వల్ల అధిక మంది వీటికోసం దరఖాస్తులు పెట్టుకుంటారు. ఉన్న షేర్లకంటే ఎక్కువ దరఖాస్తులు వస్తే, లాటరీ ప్రాతిపదికన ఆ షేర్లని కేటాయిస్తారు. అవే షేర్లు కొంతకాలం తరువాత స్టాక్ ఎక్స్ఛేంజ్‌లో లిస్ట్ అవుతాయి. ఆ షేర్లు ప్రైమరీ మార్కెట్‌లో పొందలేని వారు లేదా కొత్తగా ఆ కంపెనీ షేర్లు పొందాలనుకునేవారు వీటిని ఫలానా రోజు మార్కెట్‌లో వున్న ధరకి కొనుక్కుంటారు. ఉదాహరణకు రిలయన్స్ ఇండస్ట్రీస్ షేర్లు. కంపెనీ మొదటిసారి మార్కెట్‌కి వచ్చినప్పుడు ఆ షేర్లని చాలామంది ఒక్కో షేరుకి పదిరూపాయిలు (ముఖ విలువకే) కొన్నారు. అవే షేర్లు ఇప్పుడు దాదాపు వెయ్యి రూపాయలు పైనే (ఒక్కో షేరు) ధర వుంది. (రోజూ పేపర్‌లో పడే రేట్లే సెకండరీ మార్కెట్‌కి సంబంధించినవి సుమా) వాటిని





కొనాల్సినవారు స్టాక్ ఎక్సేంజ్ బ్రోకర్ ద్వారా వాటిని కొనుక్కుంటారు. ఇప్పుడు వెయ్యి పైనే వున్న షేరు భవిష్యత్‌లో నాలుగొందలు కావచ్చన్న వ ఊహతో వారు కొంటారు.

అయితే ప్రస్తుతం స్టాక్ మార్కెట్ స్లంప్‌లో వున్నందున ప్రైమరీ మార్కెట్‌లో సైతం ఎక్కువగా షేర్లు ప్రజలు కొనడం లేదు. అందుకే ఎక్కువగా కొత్త కంపెనీలు ఈ మధ్య ఆవిర్భవించడం లేదు. ప్రైమరీ మార్కెట్‌లో షేర్లు కొనాలనుకునే వారికి ఆ కంపెనీ భవిష్యత్ పనితీరు, ప్రమోటర్లు, వస్తువుల డిమాండ్, సప్లయిల గురించి క్షుణ్ణంగా తెలుసుకొని పెట్టుబడి పెట్టాలి. చాలా కొత్త కంపెనీల షేర్లు నేడు ముఖ విలువ (10) కి కూడా కోట్ కావడం లేదు.

అయితే ప్రైమరీ మార్కెట్‌లో షేర్లు కొనడానికి ఓపిక లేనివారు ఎక్కువగా సెకండరీ మార్కెట్‌లో షేర్లు కొంటారు. సెకండరీ (స్టాక్) మార్కెట్‌లో షేర్లు కొనేవారు ఇంతకు ముందు ఇచ్చిన స్టాక్ మార్కెట్ అధ్యాయాన్ని క్షుణ్ణంగా చదవడం అవసరం. అంతేకాక కేవలం 25 శాతం విలువ డబ్బు మాత్రమే ఇందులో పెట్టుబడి పెట్టవచ్చు. మిగతాది డబ్బు వివిధ ఇతర ఇన్వెస్ట్‌మెంట్‌లలో పెడితే సమంజసంగా వుంటుంది.

**షేర్లలో పెట్టుబడి వల్ల లాభాలు**

1. ప్రతి సం॥ కంపెనీ వారి నుండి సిఫార్స్ చేసిన డివిడెంట్ మీకు అందుతుంది. అది మీకు ఆదాయంగా పనికొస్తుంది.
2. షేర్లని ఎప్పుడు కావాలంటే అప్పుడు ఆ రోజు అమలులో వున్న ధర ఆధారంగా బ్రోకర్ ద్వారా అమ్ముకోవచ్చు.





3. షేర్లలో పెట్టుబడి రోజు రోజుకీ వృద్ధి చెందవచ్చు. లేదా తగ్గవచ్చు. కంపెనీ ఆస్తులు వృద్ధి చెందడం వల్ల ఆ కంపెనీ మార్కెట్ ధర కూడా వృద్ధి చెందుతుంది. మీ పెట్టుబడి తాలూకు తుది ఫలితాలను మీరు రోజూ పేపర్‌లో చూసుకొని తదనుగుణంగా నిర్ణయం తీసుకోవచ్చు.
4. కేవలం డివిడెండ్, పెట్టుబడి వృద్ధి, త్వరితగతిన నగదులోనికి వాటిని మార్చుకోవడమే కాకుండా, షేర్ల వలన మరో అద్భుత ప్రయోజనం వుంది. ఒకోసారి కంపెనీ తన ఆస్తులు, విలువలు బాగా వృద్ధి చెందినప్పుడు, షేర్‌హొల్డర్‌లకి బోనస్ రూపంలో మరికొన్ని షేర్లు ఉచితంగా ఇస్తుంది. వీటినే 'బోనస్ షేర్లు' అంటారు.

**2. స్థలాలు :**



అధిక రిస్క్ ఉండడమే ఈ షేర్లకు ఉన్న పెద్ద మైనస్ పాయింట్. డబ్బు ఎక్కువగా వుంటే (కనీసం రెండు మూడు లక్షలు) ఈ రియల్ ఎస్టేట్‌లోకి దిగవచ్చు. అయితే ఇందులో సాధారణంగా రిస్క్ ఉండదు. మనం పెట్టిన డబ్బుకి సాధారణంగా ఒక్క పైసా కూడా తగ్గని రంగం ఇదేనంటే అతిశయోక్తి లేదు. అయితే పెద్ద మొత్తం డబ్బున్న వారు భవిష్యత్‌లో ఇళ్ళో, వాకిలో ఏర్పాటు చేసుకోవాలను కున్నవారు ఈ రంగంలో నిరభ్యంతరంగా పెట్టుబడి పెట్టవచ్చు. అయితే డాక్యుమెంట్లు అన్నీ సరిగా వున్నాయో, లేవో చూసుకోవాలి. అంతే కాకుండా మీరు కొన్న భూమి భవిష్యత్‌లో కబ్జాకు గురికాకుండా చూసుకోవాల్సిన బాధ్యత కూడా మీ మీద వుంది. ఈ మధ్య ప్రభుత్వం వారు రోడ్డు వెడల్పు సైతం చేస్తున్నారు. మీరు కొన్న ఇల్లు లేదా స్థలం మెయిన్ రోడ్డుమీదకు రాకుండా వుంటే అన్ని విధాలా శ్రేయస్కరంగా వుంటుంది.





**3. బ్యాంకు డిపాజిట్లు:** ప్రస్తుత రోజుల్లో అత్యంత భద్రతా దాయకమైన పెట్టుబడిగా బ్యాంకు డిపాజిట్లు విరసిల్లుతున్నాయి. అందుకు కారణం చిట్‌ఫండ్‌లు, ఫైనాన్స్ కంపెనీలు, కో-ఆపరేటివ్ బ్యాంక్‌లమీద ప్రజలకు కలిగిన నిరసన భావం. అయితే బ్యాంక్ డిపాజిట్ల మీద ప్రస్తుతం వడ్డీ చాలా తక్కువగా వుంది. ఫిక్స్‌డ్ డిపాజిట్ల మీద కేవలం 6 నుండి 9 శాతం మాత్రమే వడ్డీ ఇస్తున్నారు. వచ్చే వడ్డీ తక్కువ అయినప్పటికీ పెట్టుబడి భద్రత వుంచడం వల్ల రిటైర్ అయినవారు వీటిలో తమ డబ్బు దాచుకుంటున్నారు. అయితే వీటిలో వచ్చే వడ్డీ ఒక నిర్ణీత మొత్తం దాటితే ఇన్‌కంటాక్స్ వారి దృష్టి పడే అవకాశం వుంది. కాబట్టి ఇన్‌కంటాక్స్ పరిధిలోకి రానంత వడ్డీ వచ్చేవరకు మాత్రం వీటిలో డిపాజిట్ చేయడం మంచిది.

**4. కంపెనీ డిపాజిట్లు:** రిలయన్స్ కంపెనీ సృష్టించిన ఒక కొత్త విప్లవమే ఈ కంపెనీ డిపాజిట్లు. తమ కంపెనీకి కావాల్సిన అప్పుకోసం బ్యాంకుల చుట్టూ తిరిగి వేసారిన అంబాని మదిలో వెరిసిన ఆలోచన తుది రూపమే ఈ కంపెనీ డిపాజిట్లు. ఫలితంగా అనేక కంపెనీలు ప్రజల దగ్గర నుండి డబ్బు సేకరించి, వారికి బ్యాంకు డిపాజిట్లులాగా వడ్డీ ఇవ్వడం ప్రారంభించాయి. అయితే ప్రస్తుతం ఈ కంపెనీ డిపాజిట్లు ప్రాముఖ్యత కోల్పోయాయి. ఆర్థిక వ్యవస్థ మందకొడిగా వుండటం, ఎక్కువ కంపెనీలు సరిగాలేక లేదా అసలు వడ్డీ చెల్లించక పోవడంతో ప్రజలు వీటిపట్ల నమ్మకం కోల్పోయ్యారు. ఒకప్పుడు 15 లేక 16 శాతం వడ్డీ ఇచ్చిన ఈ కంపెనీ డిపాజిట్లు ప్రాముఖ్యం కాలక్రమేణా తగ్గిపోయింది. వీటిని ఇప్పుడు ఎవరూ పట్టించుకోవడం లేదు.





**5. బంగారం :** అటు ఆడవారికి ఆభరణాల్లా, ఇటు ఒక పెట్టుబడిగా ఉపయోగపడేదే ఈ బంగారం. చాలామంది ఇంట్లో, లేదా బ్యాంకు లాకర్లలో బంగారాన్ని నిలువ చేస్తారు. ఒక నిర్ణీత కాలంలో సంభవించే బంగారం రేట్లలోని తేడాలే ఎక్కువమంది వీటి పెట్టుబడిగా పెట్టడానికి కారణం. ఇరవై సంవత్సరాల గ్రాము 430 ఉన్న బంగారం నేడు 2500 రూపాయలు పలుకుతోంది. అత్యవసర పరిస్థితులలో ఒక చోటు నుండి మరో చోటుకు తీసుకెళ్ళడానికి బంగారాన్ని మించిన ప్రత్యామ్నాయం లేదు. ఉదాహరణకు యుద్ధం సమయంలో బంగారం చాలా త్వరితంగా నగదు రూపంలో మారుతోంది. మిగతా ఆస్థులు ఆ సమయాల్లో ఎవరూ కొనడానికి సాహసించరు. ఈ 'బంగారం' పెట్టుబడి పెట్టడం వల్ల మరో లాభం కూడా వుంది. మనకు ఎప్పుడు కావాలంటే అప్పుడు బంగారాన్ని కుదువ బెట్టి బ్యాంకుల్లో, మార్వాడి సేటుల దగ్గర మన అవసరాలకి డబ్బుని పొందవచ్చు.

**6. నేషనల్ సేవింగ్: సర్టిఫికెట్లు**



వీటిమీద వడ్డీ తక్కువ వచ్చినప్పటికీ ఇవి కేంద్ర ప్రభుత్వ అధీనంలోనే వున్నాయి. కాబట్టి పూర్తి భద్రత కలవి. దీని ముఖ్య లక్షణాలు ఇవి. 1. వీటిని ఏ మొత్తంలోనైనా కొనవచ్చు. ఒక నిర్ణీత కాలంలో వీటిని వాపసు చేస్తారు. అయితే ఐదేళ్ళ తర్వాత వీటిని నగదు రూపంలోకి మార్చుకోవచ్చు. 2. దీనిమీద వచ్చే రాబడికి ఆదాయపన్ను మినహాయింపు వుంటుంది. 3. దీని వడ్డీ ప్రస్తుతం 8 నుండి 9 శాతం వుంది.

**7. జీవిత భీమా : పాలసీలు** జీవిత భీమా పాలసీల వల్ల ఒక వ్యక్తి తప్పనిసరిగా ప్రతినెలా లేదా సం॥ తప్పనిసరిగా ప్రీమియం కట్టాల్సి వుంటుంది. ఈ ప్రీమియం మీద ఆదాయం పన్ను ఇతర





మినహాయింపులతో కలిపి లక్ష దాకా పొందవచ్చు. దీని ముఖ్య లక్షణం ఏమిటంటే పాలసీ తీసుకున్న వ్యక్తి మరణిస్తే భీమా మొత్తం అతడి వారసులకు చెల్లిస్తారు. పాలసీలు మొత్తం చెల్లించకుండా మధ్యలోనే పాలసీ దారుడు పోయిన అతడి వారసులకు భీమా మొత్తం చెల్లిస్తారు. అంటే వారసుదారుల రోడ్డుమీద పడకుండా ఈ ఎల్.ఐ.సీ. పాలసీలు కాపాడుతాయి. ఇవి ముఖ్యంగా రెండు రకాలు. అవి

**1. ఎండోమెంట్ పాలసీలు :** ఇందులో భీమా చేసిన వ్యక్తి మరణించినప్పుడు లేదా ఆ వ్యక్తి సూచించిన నిర్ణీత కాలం ముగిశాక, భీమా మొత్తం ఆ వ్యక్తికి లేదా వారసులకు చెల్లిస్తారు.

**2. ఇన్‌స్టాల్‌మెంట్ పాలసీలు :** ఇందులో ప్రతి ఐదు సం॥లకు (భీమా దారుడు చనిపోక పోయినా) ఓ నిర్ణీత మొత్తం చెల్లిస్తారు. అలా నాలుగైదు ఇన్‌స్టాల్ మెంట్‌ల్లో భీమా మొత్తం చెల్లిస్తారు.

**8. పబ్లిక్ ప్రావిడెంట్ ఫండ్‌లు:** ఈ పబ్లిక్ ప్రావిడెంట్ ఫండ్‌ని ప్రభుత్వం ఆపరేట్ చేస్తుంది. అయితే దీని గురించి చాలామందికి తెలియదు. ఇందులో వున్న ప్రయోజనాలు చూద్దాం.

1. మీరు వంద రూపాయిలు నుండి నలభైవేల దాకా ఒక సం॥ కాలంలో ఇందులో పెట్టుబడి పెట్టవచ్చు.
2. దీనిలో సుమారు 9 శాతం వడ్డీ వస్తుంది. ఆ వడ్డీ అసలులో కలిపి చక్రవడ్డీ ప్రాతిపదికన వస్తుంది. ఈ వడ్డీకి ఆదాయపన్నులో మినహాయింపు వుంది.
3. మీరు ఇందులో పెట్టుబడి పెట్టిన వాటిలో 25 శాతం అప్పుగా తీసుకోవచ్చు. ఆ అప్పు తీసుకున్న వాటిని రెండు సం॥లోపు చెల్లించాలి.





4. ఏదైనా కోర్టులో మీ ఆస్తులు జప్తు చేసినప్పుడు ఈ పబ్లిక్ ప్రావిడెంట్ ఫండ్ కోర్టు పరిధిలోకి రాదు. అంటే ఈ మొత్తం ఏ ఋణగ్రస్తుడికి మీరు బాకీ పడ్డారో వారికి చెల్లింపలేరు. మీకే చెల్లిస్తారు.

ఇప్పుడు ఎలాంటి వ్యక్తులు ఏ రకమైన పెట్టుబడులు సమంజసంగా వుంటాయో చూద్దాం.

| | బంగారం | స్టాక్ మార్కెట్ (షేర్లు) | స్థలాలు | బ్యాంక్ డిపాజిట్లు | ఎల్.ఐ.సి. | నేషనల్ సేవింగ్స్ సర్టిఫికెట్లు | పబ్లిక్ ప్రావిడెంట్ ఫండ్ |
|---|---|---|---|---|---|---|---|
| ఉద్యోగస్తులు | | 25% | 4 | | 1 | 2 | 3 |
| గృహిణులు | 1 | 25% | 3 | 2 | | | |
| రిటైర్ అయినవారు | 25% | - | 1 | | 2 | 3 | |
| అవివాహితులు | | 25% | 1 | 2 | | | |
| పిల్లలు | | | | 1 | 2 | | |
| వ్యాపారులు | 1 | 2 | | | | | |

**గమనిక:** పైన బాక్స్‌లో ఇవ్వబడ్డ నెంబర్లు (1,2,3 మొ॥నవి) ఆయా పెట్టుబడుల్లో ముందుగా ఇన్వెస్ట్ చేయాల్సినవి ఉదాహరణకు 4*** అంటే ఆఖరున ఇన్వెస్ట్ చేయాలని అర్థం. అదే 1 అంటే మొదటి ఇన్వెస్ట్ అందులోనే చేయాలని అర్థం.

  

# డా|| కె. కిరణ్ కుమార్
## ఇతర అద్వితీయ రచనలు

### కంప్యూటర్ పుస్తకాలు

| | | |
|---|---|---|
| 1. | కంప్యూటర్ శాస్త్రం | రూ.150 |
| 2. | *A to Z* ఇంటర్‌నెట్ | రూ.100 |
| 3. | ఎం.ఎస్. ఆఫీస్ | రూ.125 |
| 4. | ఫోటోషాప్ | రూ.125 |
| 5. | డిటిపి | రూ.150 |
| 6. | ట్యాలీ | రూ.150 |
| 7. | ఓరాకిల్ | రూ.125 |
| 8. | 'సి' నేర్చుకుందాం | రూ.100 |
| 9. | జావా | రూ.200 |
| 10. | కంప్యూటర్ గైడ్ | రూ. 50 |
| 11. | ఇంటర్‌నెట్ గైడ్ | రూ. 50 |
| 12. | కీబోర్డు షార్ట్‌కట్స్ | రూ. 40 |
| 13. | A to Z వెబ్‌సైట్స్ | రూ. 40 |

### ఇంగ్లీషు లెర్నింగ్ పుస్తకాలు

| | | |
|---|---|---|
| 1. | స్పోకెన్ ఇంగ్లీష్ | రూ. 40 |
| 2. | కమ్యూనికేటివ్ ఇంగ్లీషు | రూ. 40 |

### ఇతర పుస్తకాలు

| | | |
|---|---|---|
| 1. | మీరూ లక్షలు సంపాదించగలరు | రూ.125 |
| 2. | ప్రతిభావంతుల విజయానికి 150 మార్గాలు | రూ.100 |
| 3. | ఎమ్‌సెట్ విజయానికి 150 మార్గాలు | రూ. 60 |
| 4. | ఎగ్జామ్ సక్సెస్ సీక్రెట్స్ | రూ. 50 |
| 5. | డబ్బు ఆదా మార్గాలు | రూ. 40 |
| 6. | స్టాక్ మార్కెట్‌లో సంపద పెంచుకోవడం ఎలా? | రూ. 50 |
| 7. | స్టాక్ మార్కెట్‌లో ఉత్తమ షేర్లు కొనడం ఎలా? | రూ.100 |
| 8. | మ్యూచువల్ ఫండ్స్ | రూ. 50 |
| 9. | స్టాక్ మార్కెట్ విజయ రహస్యాలు | రూ. 50 |